# ANANDA
# FOURTH READER.

TELUGU

# ఆనందవాచకపుస్తకము

నాల్గవ తరగతి.

---

BY


**KUCHI NARASIMHAM, B.A.,**

**AND**

**PANUGANTY LAKSHMI NARASIMHA RAO.**


---

**Approved by the Director of Public Instruction, Madras.**

---


1930.

**R. VENKATESHWAR & Co.,**

LOANE SQUARE, MADRAS.

ఆర్. వేంకటేశ్వర్ అండ్ కో

లోన్ స్క్వేర్ మద్రాస్.




Price 4 Annas.] [వెల 4 అణాలు.

# బోధనపద్ధతులు.

1. బొమ్మలున్నచోటఁ గేవలము బొమ్మలనుండియే పిల్లవాఁ డెంత గ్రహింపగలఁడో ప్రశ్నలువేసి కనుఁగొనవలెను.
2. ఆపాఠమున కనుకూలించు నితరపటము లేవైన లభించినయెడల, నవి చూపవలెను.
3. పిల్లవాఁడు పాఠము చదువునప్పు డుచ్చారణలోపము లున్నచో, నవి వెంటనే సవరింపవలెను.
4. పూర్వపుమార్గముగాఁ బ్రతిపదార్థములు చెప్పుటమాని, ప్రశ్నలువేసివాక్యముయొక్క యర్థమును సాధ్యమైనంతవఱకు బాలురచేతనే చెప్పింపఁ బ్రయత్నింపవలయును.
5. కఠినమైనమాటలకుఁ దక్క, మాన్యముగా వాడుకొనుమాటలకుఁ బర్యాయపదములు చెప్పనక్కఱలే దు. 'ఱంపము'నకు 'క్రకచ' మనికాని 'కరపత్ర' మనికాని యర్థము చెప్పఁగూడదు. దానిని విరివిగా చిన్నమాటలతో వర్ణించియో, ఱంపమునుగాని ఱంపపుబొమ్మనుగాని తెచ్చిచూపియో బాలురకుఁ దెలుపవచ్చును. వారి కిది ఇదివఱకే తెలిసినయెడల నర్థముచెప్పుటే యనావశ్యకము. కఠినపదములకు సులభపర్యాయపదములు చెప్పవచ్చును.
6. పాఠములో విషయము ముఖ్యము గనుక, నది బాలురకు స్పష్టమైనదో లేదో ప్రశ్నలమూలమున జాగ్రత్తతోఁ గనుఁగొనవలెను. పాఠముల క్రింది ప్రశ్నలు కొంతవఱకు సహాయములగును.
7. అర్థసంబంధమైనవి గాని, భాషాసంబంధమైనవి గాని, చమత్కారము లేవైన నున్నయెడల వానిని స్పష్టీకరింపవలెను.
8. పాఠము ముగించినతరువాత దానిని సంక్షేపముగాఁ గ్రిందితరగతులలో బాలురచేత నోటఁ జెప్పింపవలయును. పైతరగతులలో నట్లు చెప్పించుటయే కాక వ్రాయింపవలెను. ఆవ్రాసినవానిలో నిభాషాదోషములును దదితరదోషములును బిల్లవానికిఁ గనఁబఱచి సవరింపించుటగాని సవరించుటగాని చేయవలెను.
9. సంభాషణరూపములుగా నున్న పాఠము లనుకూలములైనయెడల బాలురచే నాటకభాగములవలె నప్పుడప్పు డాడింపవచ్చును.
10. కోలపాటలు, దసరాపాటలు మొదలగువానివలె బాలురచే ద్విపదలను మనోహరముగాఁ బాడింపవచ్చును.

క్రిందితరగతులలోఁ బ్రతిపాఠములో వచ్చు జంతువులనుగాని, వానియవయవములనుగాని, యితరవస్తువులనుగాని, బాలురసమర్థతలనుబట్టి, వీలైనంతవఱకు, బొమ్మలు గీయింపవలెను, రేగడిమట్టితో వానిని జేయింపవలయును, అట్టలతోను, కాగితములతోను, వానియాకారములను గత్తిరింపఁ జేయవలెను, దారములతోఁ గుట్టింపవలెను, ఈఁగలతో నల్లింపవలెను.

# PREFACE

## TO THE

# REVISED EDITIONS

Messrs. R. Venkateshwar & Co., have written to us to say that some of the Sub-Assistant Inspectors of Schools find our readers for the lower classes too difficult for the pupils for whom they are intended and asked us to revise them suitably to their wishes. They have also sent us detailed suggestions of two or three of them.

Some of their suggestions are really valuable and we have adopted them, with many thanks, in these revised editions.

But we regret we cannot see eye to eye with them in regard to most of their suggestions about *Visandhi*. Visandhis, it is true, correctly present to the eye the naked original form of the word. But some of them are unnatural and mar all euphony of the language. For instance, ఆవు పాలు ఇచ్చును; కొండను అని; నాలుగుఉన్నవి, సూర్యుఁడు ఉన్న దిక్కు; చద్ది అన్నము; ఇవి ఏనో-అయిదు అణాలు-చూరులు అందురు and such like splittings are nowhere to be heard in the actual speech of the child and sound rather outlandish to the ear, besides making the reading lesson most painful to the child pupil.

However, out of deference to the officers who have made the suggestions, we have now introduced almost all such *Visandhis* in our reader quite against our will, taking care to gradually minimise them in the third and the higher readers.

Metre and other considerations have made it impossible for us to employ *Visandhis* in our poetry.

Though there is a school of thinkers who are opposed to the *direct* teaching of morals and maxims to children through isolated verses, we have, agreeably to the wishes of our friends, supplemented our poetry in the lower readers with some good moral verses taken from the works of other writers, ancient or modern.

PITHAPURAM, 2-2-1922.

K. NARASIMHAM.
P. L. NARASIMHA RAO.

# పీఠిక

క్రింది తరగతుల యానందవాచక పుస్తకములు కఠినములుగా నున్నవని కొందఱు విద్యాశాఖాధికారు లభిప్రాయ పడుచున్నారు. కావున వలయుచోట్ల దిద్ది వానిని సులభముగా వ్రాయుఁడని యానందముద్రణాలయమువారు మమ్ముఁ గోరినారు. ఇద్దఱుముగ్గురు సబస్సిస్టెంటిన్స్పెక్టరుగార్ల యభిప్రాయములు కూడ మా కంపినారు.

వారు గోరిన సవరణలలో మాకు సమ్మతములైనవానిని [illegible] కముగాఁ జేసితిమి. విసంధులఁగూర్చి మేము వారితో నేకీభవింపఁజాలకున్నాము. శబ్దముయొక్క నిజస్వరూపము పిల్లలెఱుఁగుటఁ [illegible]నని వారి యభిప్రాయము. అది మంచిదే కాని, నియమరహితముగా విసంధులు చేసినయెడల, బాలురకు స్వాభావికోచ్చారణ మలవడుటయే కాక భాషా మాధుర్యమునకు భంగము కలుగును. చదువునప్పుడు పిల్లల నాలుకలు నొప్పిపెట్టి, పాఠము క్లేశకరమగును.

కనుక మేమిప్పుడు రెండవవాచక పుస్తకములోఁ జేసిన పెక్కు విసంధులు విద్యాశాఖాధికారులయెడల మా గౌరవమును జూపుటకుఁ జేయఁబడినవి కాని మనఃపూర్వకముగాఁ జేయఁబడినవి కావు. పై తరగతుల పుస్తకములలోఁ గ్రమముగా నట్టి యనిష్ట విసంధులు తగ్గించినాము.

ఛందోభంగాదిభీతిచేఁ బద్యములలో విసంధులు చేయుటకు వలను పడినదికాదు. ఉపాధ్యాయులకొఱకు నుద్దేశింపఁబడిన ప్రశ్నలందును వ్యాకరణ భాగములలోను విసంధులు చేయలేదు.

వెనుకటి పీఠికలోఁ, గ్రింది వాచకపుస్తకములందలి పద్యము లన్నియు స్వయరచితములఁ వ్రాసితిమి. పై యుద్యోగుల యభిప్రాయము ననుసరించి యిప్పు డితర కవికృతములైన కొన్ని నీతిపద్యములు దానికిఁ జేర్చితిమి.

పిఠాపురము,
2-2-1932.

కూచి నరసింహము,
పానుగంటి లక్ష్మీనరసింహారావు.

# ఉపోద్ఘాతము.

ఈ ప్రథమతరగతి మొదలుకొని ఎనిమిదవతరగతివఱకు, అనఁగా మూఁడవ ఫారము వఱకుఁ జదువుకొను బాలురకుపయోగకర మగునట్లు వాచకపుస్తకములను వ్రాయఁ దలంచితిమి. బాలుర వయస్సును సమర్థతను మనసునందుంచుకొని, ఏయే విషయములఁగూర్చి చెప్పినయెడల వారు బాగుగ గ్రహించుకొనఁ గలరో యట్టి విషయములఁ గూర్చియే వ్రాసితిమి. ఆవిషయములైనను బాలురు చదువుకొనుట కుత్సాహపడునట్టివియే యేర్చి వ్రాసితిమి. విసుగు పుట్టకుండునట్లు వేఱువేఱు విషయముల బోధించితిమి.

అదిగాక, బాలుర వయస్సు, బుద్ధి, యెట్లు క్రమక్రమముగా వృద్ధినొందునో తరగతులలోని కష్టము, విషయములలోని కష్టము, నట్లే వృద్ధినొందునట్లు సాధ్యమైనంతవఱకుఁ జూచి వ్రాసితిమి. మేముపయోగించుభాష సులభముగనే యుండును; కాని యదిగూడఁ బైతరగతులకుఁ బోయినకొలఁది బాలుర వయస్సమర్థతల ననుకూలించునట్లు రవంత ప్రౌఢము కాకమానదు. అంతే కాని యతిదీర్ఘములగు సమాసములనుగాని వాడుకలోలేని గ్రాంథిక శబ్దములనుగాని యుపయోగించి భాషను దుర్గ్రాహ్యముగఁ జేయము. మఱియు వాడుకలో నున్నపదములకు దాయనిరోయించి వ్యాకరణదుష్టరూపములను బ్రయోగింపము.

మొక్కలను గూర్చికాని జంతువులఁ గూర్చికాని వ్రాయునప్పుడైనను, వృక్షజంతుశాస్త్రములలోని దుర్గ్రాహ్యాంశము లందుఁ జేరనీయక, తెలుపఁదగిన ముఖ్యాంశములను వదలక, సామాన్యపాఠములవలెనే యవిగూడ సుబోధము లగునట్లు వ్రాసితిమి. శాస్త్రవిషయక పాఠములను జదువుకొనునప్పుడైనను వానిలోని విషయములను గ్రహించుకొను నొత్తిడి బాలుర చిత్తములకుఁ దగులకుండునట్లుగాఁ బాఠరచనాపద్ధతి చిత్తరంజకముగా నుండునట్లు చేయఁ బ్రయత్నింతుము.

అడుగుతరగతుల వాచకపుస్తకములలో, విసంధులను గొన్నికొన్నిపట్లఁ బేరుగన్న యాధునికవచనగ్రంథకర్తలు వాడియున్నారు. అట్లొనర్చుట మంచిదనియే మాయభిప్రాయము. అయినను వానిని మే మొక్కనియమము ననుసరించి జాగరూకతతో వాడెదము. శబ్దముల కర్థము స్పష్టము గాదని తోఁచినచోట్లఁగాని, విపరీతార్థము లగునని తోఁచినచోట్లఁగాని, విసంధుల నుపయోగించెదము. శ్రవణకటుత్వము కలుగునని తోఁచిన కొన్నిచోట్లఁ గూడ వాని నుపయోగించెదము.

## Part II.



## Part III.



మొ ద టి భా గ ము.

# 1. బీదవాఁడు, రూపాయలసంచి.

ఒక పట్టనములో ఒక గొప్పసత్ర ముండెను. దానిలో బాటసారులు అనేకులు బసచేయుచుండురు. ఆ సత్రములోని తలుపులన్నియు భద్రముగా రాత్రివేయుచుండుట, బాటసారులకు కావలసినగదుల తలుపులు తీయుట, మొదలగు పనులు చేయుటకు సత్రము గుమ్మములో ఒక నౌకరు కాఁపుండెను.

ఈతఁడు మిక్కిలి బీదవాఁడు. ఈతనికొకరోజున ఒక రూపాయలసంచి సత్రములో దొరకెను. దానిలో రెండువందల రూపాయ లుండెను. తనకు దొరకిన సొమ్ము తనదేకదా అని ఆబీద సేవకుఁడెంచక తనకు రెండువందల రూపాయిలసంచి దొరకిన దనియు, అది ఎవరిసంచియో వారు వచ్చి తనయొద్దనుండి తీసికొని పోవచ్చుననియు పట్టనములోఁ జాటింపఁ జేసెను. వార్తాపత్రికలలో ప్రకటింపఁ జేసెను.

అంత, భాగ్యవంతుఁడగు ఒక వర్తకుఁడు వచ్చి ఆసంచి తనదని రుజువుపఱచి దానిని తీసికొనెను. ఆబీదసేవకునియెడల విశ్వాసమును కనఁబఱచుటకై యిరువదిరూపాయలు ఆతనికి వర్తకుఁ డీయఁబోయెను. ఆరూపాయలను తీసికొనక "నీసొమ్ము నీ కిచ్చుట నాకు విధి కనుక నేనట్లు చేసితిని. ఇందులకై నాకు పారితోషిక మక్కఱలేదు" అని ఆనౌకరు చెప్పెను.

పదిరూపాయలైనను తీసికొమ్మని ఆవర్తకుఁ డాతని బతిమాలెను. బీదసేవకుఁడు తీసికొనుట కిష్టపడలేదు. అయిదు రూపాయలైనను తీసికొమ్మని ప్రార్థించెను. బీదసేవకుఁడు తీసికొనుట కిష్టపడలేదు.

పోనీ! చాటింపించుటకైన ఖర్చయినను తీసికొనుమనిగడ్డము పట్టుకొనెను. బీదసేవకుఁడు తీసికొనుట కిష్టపడలేదు.

వర్తకునికి తుదకు ప్రాణము విసుగ, ఆతఁ డాసంచి సేవకునిముందు పాఱవైచి "ఈసంచి నాదికాదు. దీనితో నాకేమియు సంబంధము లేదు. ఇది నీ వుంచుకొన్న సరే, మానినను సరే. నీవు కొంచెమైనను తీసికొనకపోయిన తరువాతను ఈసంచి నాకక్కఱలే"దని కఠినముగ పలుకుచు వెడలి పోవ ప్రయత్నించెను.

అప్పుడు బీదసేవకుఁ డాతనిని పట్టుకొని అయిదు రూపాయలను తీసికొని వెంటనే బీదవాండ్రకు పంచిపెట్టెను.

ప్రశ్నలు:—1. తనకు దొరకిన సంచిని నౌకరు తా నేందు కుంచుకొనలేదు? 2. ఉంచుకొనక యేమిచేసెను? 3. బహుమతిని పుచ్చుకొనుట కతఁ డేల యిష్టపడలేదు?

మాటలు.—సత్రము, బాటసారి, భద్రము, వర్తకుఁడు, విధి, కఠినముగ.



## 2. కోఁతి.

గోదావరీతీరమందు ఒక తోఁటకలదు. దానిలో పలువిధములగు వృక్షము లుండెను. తోఁటకాపరి అందులోనే గృహము కట్టుకొని కాఁపురముచేయుచుండెను. అక్కడ వానికి పశువులు,కుక్కలు, పిల్లులు మొదలగుజంతువులు కూడ ఉండెను.

వాని కుమారుఁడొకనాఁడు జీడిమామిడి గింజెలుకొన్ని యెక్కడనుండియో తెచ్చి కాల్చుకొనుచుండెను. ఆ ప్రాంతముందుఁగల కోఁతులలో ఒకటి, చెంతను ఒక చెట్టుమీఁదఁ గూర్చుండి చూచుచుండెను. ఆ పిల్లవాఁడు గింజెలు కాల్చుకొని, బ్రద్దలుగొట్టి, లోని పలుకులు కొన్ని తినుచుండఁగా చెట్టుమీఁది కోఁతి క్రిందికి దిగి వానిని సమీపించెను. పిల్లవాఁడు ఆమర్కటమును చూచి, భయపడి, మిగిలిన పప్పు, అక్కడనే విడిచిపెట్టి పాఱిపోయెను. ఆపప్పును కోఁతి తినివేసెను. జీడిపప్పుయొక్క కమ్మని రుచి వానరము మఱచిపోదయ్యెను.

మఱునాఁడుకూడ తోఁటకాపరికొడుకు మఱికొన్ని జీడి

మామిడిగింజెలు తెచ్చుకొనుచుండఁగా తొలినాఁటి కోఁతి వానిని జడిపించి, ఆగింజెలెత్తుకొని పోయెను; కాని, ఆ గింజె లెక్కడ కాల్చుకొనవలెనో తెలియక ఇట్టటు తిరుగుచుండఁగా కొంతసేపటికి నదీతీరమున నుండు జాలరిరేవులు జ్ఞప్తికి వచ్చినవి. వెంటనే ఆకోఁతి అక్కడకు పోయెను. అప్పుడు సాయంకాలమైనది. జాలవాండ్రు ఇండ్లకు పోవుచుండిరి. కోఁతి ఒక పొయ్యియొద్దకు పోయి, దానిలోని నిప్పును చూచి, సంతసించి, గింజెలు ఆనిప్పులోవైచెను. కొంత సేపటికి గింజెలు పెట్లి ప్రేల నారంభించి కమ్మనివాసనలువేయ మొదలు పెట్టెను. తోఁటలోని పిల్లి ఆవాసనఁబట్టి, వెంటనే అక్కడకు పోయెను. కోఁతికిని గింజెలను బైటికితీయు ఉపాయము తోఁపలేదు. తన చేతితో తీసినచో చేయి కాలునని మాత్రము తెలియును; కాని, పిల్లిని జూడఁగానే పరమసంతోషముతో దానిని పిలిచి మిక్కిలి గౌరవించెను. పిల్లియు గింజెలలోని పలుకులు తినుటకొఱకే అక్కడకు పోయినది; కాని, ఆగౌరవమునకు సంతసించి కోఁతియొద్దనే కూర్చుండెను. "కాలినగింజెలను తీసికొందము ర"మ్మని చెప్పుచు, పాపము పిల్లి చేయి గట్టిగాపట్టుకొని నిప్పులలోని గింజెలుతీసెను. చేయి తెగఁ గాలుటచే పిల్లి "జీడిపప్పుకై పోఁగా జీవహాని సిద్ధమైనది. బ్రతికియున్న బలుసాకు తినియుండవచ్చును" అని ఒక్క పరుగున పాఱిపోయెను.

స్వార్థపరులు, మంచి చెడ్డలు చూడక బుద్ధిహీనులను మోసపుచ్చి తమ కార్యములు నెఱవేర్చుకొందురు.

ప్రశ్నలు:—1. జీడిమామిడి గింజెలు కోఁతి కెట్లు దొరకెను? 2. వాని

నది యేచోటఁగాల్చెను ? 3. కాలినగింజ లీవలి కట్లు తీయఁగలిగెను ? 4. ఈపాఠమువలనఁ బ్రపంచములో నెట్టి స్వభావముగలవా రున్నారని తెలిసికొనఁగలము ?

మాటలు.—తీరము, వానరము, వృకము, పలుకు, జ్ఞప్తి, గౌరవించుట, స్వార్థపరులు, బుద్ధిహీనుఁడు, నెఱవేర్చుకొనుట.

---

## 3. భూమి కొలతలు.

కరణము, గోపాలరావు, సుబ్బావధాని.

క:—ఇట్లు కేకలువేసికొనుచు వచ్చుచున్నా రేమి?

గో:—ఏమియు లేదండి. "అవధానిగారూ! మీ కెంత భూమి ఉన్నది" అని అడిగినప్పుడు తిన్నగా చెప్పఁగూడదా?

సు.—చెప్ప కేమి, కరణముగారూ! పుట్టెఁడుభూమి ఉన్నదని చెప్పినాను. అంతట "ఇన్ని యెకరములని చెప్పిన మీపుట్టి యేమి మునిఁగినది"? అని పెద్ద పిన్న వాసి చూడకుండ అన్నాఁడుగదా! అట్లనవచ్చునా?

గో.—ఆయనమాత్రము ఊరకున్నాఁడా? "నాపుట్టి మునిఁగిన నీయెకరము మునుఁగదా"? అన్నాఁడు. నా యెకరము కంటె ఆయనపుట్టి యేమి యెక్కువ?

క.—అవధానిగారూ! కోపపడకుఁడు. మీ పుట్టి మునిఁగిన యెడల దమ్ము బాగుగా అగును; అంతకంటె బాధ యేమియు లేదు. ఎకరము తప్పమాటకాదు.

గోపాలరావూ! నీ వట్లనఁగూడదు. నీయెకరము కంటె ఆయన పుట్టి యెక్కువే

కలహకారణము ఇప్పుడు బోధపడినది. మీ వివాదము ఇప్పుడే తీర్చెదను. కొంచెము సేపు ఊరకుండుడు.

భూమి యిన్ని పుట్లనియును చెప్పవచ్చును, ఇన్ని యెకరములనియును చెప్పవచ్చును.

పుట్టియనఁగా ఎనిమిది యెకరములు; పందుము, నాలుగెకరములు; ఏఁదుము, రెండెకరములు. ఎనుబది కుంచెము లొక పుట్టి. కనుక, పది కుంచెము లొక యెకరము.

గో.—పేర్లు బాగుగానున్నవి. ధాన్యము కొలిచినట్లు భూమి కొలిచి పోణకలలో పోసెదరా యేమి? అట్లైన గోయి దీసి మట్టి కొలిచినయెడల మాచిన్న పెరడే కావలసినన్ని పుట్లౌను.

న.—చూచినారా! మాటల వాలకము? పుట్టెఁడు విత్తులు (ఎనుబదికుంచెములు) చల్లుటకు చాలిన భూమిని పుట్టెఁడందురు. ఎకర మెట్లువచ్చినదో కొంచెము చెప్పుమనుఁడు.

క.—అబ్బబ్బా! నన్ను చెప్పనీయరేమి? పుట్టికొలతలు మన దేశపు పూర్వపు కొలతలు. ఎకరపు కొలతలు మన ప్రభుత్వమువారి కొలతలు. గజము తెలియుదురా?

న.—గజము తెలియకేమి, యెకరములు తెలియవుగాని?

క.—గజము పొడుగు, గజము వెడల్పుగల భూమి ఒక చేదరపు గజము.

గో.—ఒక అడుగు వెడల్పు, మూడు గజముల పొడుగుగల నేలమాత్రము ఒక చేదరపు గజము కాదా యేమి?

క.—ఔను. నీ విట్టి తగవులమారివి గనుకనే అవధానిగారికి అంతకోపము వచ్చినది.

అట్టి చేదరపుగజములు 4840 అయినయెడల ఒక యెకరమగును. ఎకరమునకు నూఱు సెంట్లు, సెంటనఁగా (ఎకర

ములో) నూఱువవంతు. అది రమారమి 49 చేదరపుగజము లుండును.

ప్రశ్నలు:—1. అవధానిగారికిని గోపాలరావునకును గలిగిన జగడమునకుఁ గారణమేమి? 2. ఎకరమున కెన్నికుంచెములు? 3. పుట్టి కెన్ని యెకరములు? 4 ఎకరమున కెన్ని సెంట్లు, ఎన్ని చేదరపు గజములు?

మాటలు.—పుట్టిమునుఁగు, వాసి, దమ్ము, వాలకము తగవులమారి.



## 4. ఎలుక, కప్ప.

ఒక యెలుకకు దురదృష్టమున కప్పతో ఒకప్పుడు మైత్రి సంభవించెను. కప్ప తఱచుగా తనమిత్రుని చూచుటకు నీటిలో నుండి వెలుపలికివచ్చి గట్టుమీఁద ఆడుచుండును. ఒకొక్కప్పుడు గట్టుప్రక్కనున్న పొలములలో మేఁతకై అవి రెండును తిరుగుచుండెడివి.

“నేను నీ భూమిమీఁదికి వచ్చి నీతో సంతోషముగా తిరిగినట్లు నీవుకూడ నా చెఱువులోనికి వచ్చి అచ్చట నాతో

సంతోషముగా తిరుగవా?" అని కప్ప యెలుకను ఎన్ని సారులో అడిగెను. ఎలుకకు నీరన్న మిగుల భయముగుటచే అది అందులకు ఒప్పుకొనలేదు.

కప్ప ఒకదినమున గట్టుపైకి వచ్చి యెలుక కాలికిని తనకాలికిని గట్టిగ త్రాడు పెట్టి కట్టుకొనెను. ఇట్లు రెండును కొంతసేపు కలిసి కుంటుకొనుచు ఆహారమునకై విలాసముగా తిరిగెను. తిరిగినపిమ్మట కప్ప మెల్లగా నీటిగట్టునకువచ్చి యెలుకకు హాని చేయవలయునను దురుద్దేశముతో ఆలంకె త్రాటితోడనే నీటిలో గుబాలున దుమికెను. కప్పకునీటిలో సౌఖ్యమే కావున తాను జేసినపనికి లోపలసంతోషించుచు చుట్టుట్లు దుముకుచుండెను. ఎలుక మాత్రము ఊపిరిసలుపక పోవుటచే చచ్చినీటిమీఁద తేలెను.

ఇంతలో ఒక డేగ ఆకాశమున తిరుగుచు చెఱువులో తేలుచున్న యెలుకను చూచెను. దానిని కొనిపోవుటకై చెట్టున చెఱువుమీఁదికి వ్రాలి తనకాలిగోళ్లలో దానిని ఇఱికించుకొని వెంటనే పైకెగిరిపోయెను. ఎలుక కాలికిని కప్పకాలికిని లంకె యింకను ఉన్నది గనుక ఎలుకతోఁగూడ కప్ప పైకి పోవలసి వచ్చెను. డేగ కప్పను చంపి భక్షించెను.

ఒకనికి కీడుచేయువాఁడు తాను కీడు పొందకమానఁడు.

ప్రశ్నలు:—1. కప్ప యెలుకను దఱచుగా నేమియడిగెను? 2. కప్ప యెలుక నెట్లు మోసము చేసెను? 3. ఈపాఠ మేమినీతిని బోధించును?

మాటలు.—మైత్రి, సంభవించెను, విలాసము, బంధము.

# 5. మేఁక.

ఆవు. గేదె. మేఁక, గొఱ్ఱె యివి నెమరువేయు జంతువులు. మేఁక ప్రపంచమున దంతటను ఉండును. అది తుప్పలమీఁదను

కంచెలమీఁదను ఉండునట్టి ఆకులను తిని బ్రతుకును.

మేఁక కొమ్ములు కొంచెము వెనుకకు వంగియుండును.



పోతుమేఁకలను చింబోతులందురు. వీనికి కొంచెము పొడుగైన గడ్డముండును. ఆఁడు మేకలకు సాధారణముగా అట్టి గడ్డముండదు. ఒకజాతి మేఁకలను, కంచిమేఁక లందురు. అవి పెద్దపొడుఁగు గలిగి యెక్కువ పాలిచ్చును.

మేఁక లున్నచోట, ఒకవిధమైన వాసన గొట్టును.

ఎంత ఎత్తైన పర్వతమునైన మేఁక లవలీలగా ఎక్కి మేఁత మేయును. ఎత్తైన కొండలమీఁది నిట్రాలను నిర్భయముగా ఎక్కిపోవును.

మేఁకపిల్లలు చిన్నప్పుడు ముద్దుగాఁ నుండును. నాలుగైదు పిల్లలు కలిసి ఒకటినొకటి పొడుచుకొనుచు, చెంగున దాఁటుచు పరుగు లెత్తుచు ఉండును

ఆవులకును, గేదెలకును ఆహారము దొరకనిచోట్లకూడ, మేఁకలకు మేఁతదొరకును. అందుచేత మేఁకలను పెంచుట సులభము.

ఆఁడుమేఁక ఈఁతకు రెండు మూఁడు పిల్లలను పెట్టును.




నెమరు వేయు జంతువులకు నాలుగు ఆహారకోశములుండును. వానిలో మొదటియాహారకోశము పెద్దది. అది నిండువఱకు ఈ జంతువులు వడివడిగా మేయును. ఈ మేసినమేఁత రెండవ యాహారకోశములోనికిఁ బోయి, ఉండ లుండలుగా అగును. వీనిని తిరుగ నోటిలోనికి తెచ్చుకొని అవి చక్కఁగా నమలి మ్రింగును. మొదట మ్రింగిన యాహారమును తిరుగ నోటి లోనికి తెచ్చుకొని చక్కఁగా నమలుటనే నెమరువేయుట యందురు. రెండవసారి మ్రింగినపదార్థము మూఁడవ కోశము లోనికిని, పిదప నాల్గవకోశము లోనికిని పోవును. అక్కడ నుండి తరువాత, ప్రేగులలోనికి పోవును.

అడవులలోని నెమరువేయు జంతువులను క్రూర మృగ ములు తినివేయును గదా! కనుక అవి రాకముందే వడి వడిగా కడుపునిండ మేసి, తరువాత నిరపాయమైన స్థలము లకు పోయి, సావకాశముగా నెమరువేసి, ఆ మేఁతను జీర్ణము చేసికొను శక్తి, భగవంతుఁడా జంతువులకు దయచేసి నాఁడు కాఁబోలు.

మేఁక మిక్కిలి ఉపయోగకరమైన జంతువు. మేఁకల మందలను పొలములలో కట్టినచో, వాని యెరువువలనభూమి సారవంతమగును. పంట యెక్కువపండును. మేఁక బొచ్చుతో, కంబళ్లు నేయుదురు. దాని చర్మము మృదువైనది. దానితో అనే కములైనసరకులు చేయుదురు. మేఁకమాంసమును అనేకులు

భుజింతురు. ఆవుపాలవలె మేఁకపాలు పొట్టలో పేరుకొనవు. అందువలన తేలికగా జీర్ణమగును. మేఁకపాలు కొన్నివ్యాధులకు మంచిమందు. మేఁక క్రొవ్వుతో సబ్బులును, వత్తులును చేయుదురు. యజ్ఞములందు మేఁకను జంపి, వపను హోమము చేయుదురు. మేఁకలను గ్రామదేవతలకు బలులిత్తురు.

మేఁకకు ధైర్యము లేదు. కనుకనే పిఱికివాని పై ధైర్యమును మేఁకపోతు గాంభీర్య మందురు.

మేఁక మిక్కిలి సాధుజంతువు. కోడివలె మేఁకకును సాధారణముగా, అకాలమృత్యువే సంభవించుచుండును.

మేఁకవలె గొఱ్ఱెలును మిక్కిలి ఉపయోగకరములు. గొఱ్ఱెకు బొచ్చు విశేషముగా ఉండును. కనుక దానితో ఎన్నియో ఉన్నిబట్టలు మొదలగునవి చేయుదురు. మగగొఱ్ఱెలను పొట్టేళ్లందు రని మీరెఱిఁగిన దే కదా. పందెములు వేసికొని పొట్టేళ్లచేత పోట్లాడింతురు.

ప్రశ్నలు:—1. మేఁక లెక్కడనుండును? 2. నెమరు వేయుటయనఁగా నేమి? 3. మేఁక యుపయోగ మేమి? 4. మేఁకపోతు గాంభీర్య మనఁగా నేమి? 5. గొఱ్ఱెలలో మగవాని నేమందురు? 6. వాని యుపయోగ మేమి?

మాటలు.— పర్వతము, సులభము, ఆహారకోశము, ప్రేగు, సారవంతము, భుజించుట, జీర్ణమగుట, వ్యాధి, మందు, యజ్ఞము, హోమముచేయుట, అకాలమృత్యువు సంభవించుట.

---

## 6. నాణెములు, టంకసాల.

సెనగపప్పు, పటికబెల్లము కొనుటకు మీరుపట్టుకొనివెళ్లెడు డబ్బులును, బడిజీతములకిచ్చెడు రూపాయలును, మీఅక్కలు తల్లులు మెడలవేసికొనెడు కాసులును నాణెములే.

వానిలో పాతడబ్బులు రాగినాణెములు, రూపాయలు వెండి నాణెములు. కాసులు బంగారునాణెములు.

పాత డబ్బులు మాత్రము కేవలము రాగినాణెములు. తక్కిన రెండును కొంత రాగి పాలున్న వెండి బంగారు నాణెములు. అనఁగా మిశ్రలోహములతో చేసిన నాణెములు. రూపాయలో రూపాయయెత్తు వెండియుండదు. కాసులో కాసెత్తు బంగారముండదు.

స్వచ్ఛమైన వెండియు, స్వచ్ఛమైన మేలిమి బంగారమును, మెత్తగానుండి, సాగి, నొక్కులుపడును. నాణెములు గట్టిగా నుండి, వంగిపోక, చిరకాల ముండవలెను. కావున వానిలోఁ గొంచెము రాగి కలుపుదురు. రాగివలన వెండి బంగారములకు గట్టితనము వచ్చును.

మిశ్రలోహములలో మఱియొక విశేషము గలదు. అవి ప్రత్యేకలోహములకంటె సులభముగా కరఁగును. కాని, నాణెములు మూసలలో కరఁగిపోసి చేసినవని భ్రమపడఁగూడదు. అట్లు చేయుటకు వీలులేదు. కరఁగిన వెండి బంగారములుగాని, రాగిగాని, చల్లారి ఘనీభవించినప్పుడు, కుదిసి, ముడుఁచుకొనిపోవును. అందుచేత, అచ్చుమీఁద చెక్కిన చిహ్నములు సరిగా అంటవు. కనుక అన్నినాణెములు ఈ క్రిందివిధముగా చేయుదురు.

మొట్టమొదట నాణెములకు కావలసిన లోహమును కరఁగి, కడ్డీలుగా పోయుదురు. వానిని ఒక యంత్రములో పెట్టి నొక్కి, తగిన దళసరి తేకులుగా మార్తురు.

తరువాత ఆతేకులను మఱియొక యంత్రముతో కావలసిన ప్రమాణముగల గుండ్రని ముక్కలుగా త్రుంపుదురు.

ఈబిళ్లలను, క్రింద ఒకయచ్చును, మీఁద ఒకయచ్చును, చుట్టును కక్కులయచ్చు గల ఒక యంత్రములో పెట్టి ఒత్తుదురు.

అంతట మనరాగి, వెండినాణెముల కొకవైపున నాణెము పేరును, సంవత్సరమును, నకిషీయును నొక్క పడి అంటును.

రెండవప్రక్కను ప్రభు విగ్రహమును, ప్రభునామ బిరుదములును నొక్కపడును.

క్రింది,మీఁది యచ్చులొక్కసారిగా నాణెపుముక్కను అదుముట చే, అది తక్కువ మందమై, సాఁగి, అంచున కొంచెము పెరిఁగ చుట్టునున్న కక్కులముద్రను గట్టిగాపట్టుకొని నొక్కపడును. అందుచేత నాణెముచుట్టును గఱుకుగఱుకుగా గీఁతలు పడియుండును.

ఈ నాణెములను, ఎక్కువ తూనికగలవిగాను, తక్కువ తూనికగలవిగాను, సరియైనతూనికగలవిగాను, తులాయంత్రములు అతివేగముగా విడఁదీయును.

సిసలైన యెత్తుగలనాణెములను పేసవాడుకలోనికి తెత్తురు.

నాణెములుచేయు యంత్రములు మిక్కిలి చిత్రమైనవి. అవి నిమిషమునకు, 120 మొదలు 200 నాణెములవఱకు చేసి ఈవల పడవేయునఁట.

నాణెములుచేయు శాలలను టంకసాల లందురు.

ఈ పనిని సర్కారువారే చేయింతురు; కాని, ఇతరుల కీయరు. దొంగనాణెములు చేయువారిని పట్టుకొని శిక్షింతురు.

ప్రశ్నలు:—1. మన నాణెము లేయే లోహములతోఁ జేయుదురు? 2. కాసులోను, రూపాయలోను నున్నలోహము లేవి? 3. మిశ్రలోహములు ప్రత్యేక లోహములకంటె నాణెముల కెట్లెక్కువ యుపయోగకరములు?

4. నాణెముల నెందుచేతఁ బోఁతపోయరు? 5. రూపాయలుచేయు విధమును సంగ్రహముగాఁ జెప్పుము? 6. టంకసాలలో గంటకెన్ని నాణెములు చేయఁగలరు?

మాటలు.—మిశ్రలోహములు, మూస, ఘనీభవించు, కుదియు, కిడ్డీ, నకిషీ, ప్రమాణము, కక్కులు, గఱుకు, తులాయంత్రములు, దొంగనాణెములు.

---

# 7. ఓరిమి.

తురుష్క దేశములో "హారూన్ రషీద్" అను చక్రవర్తియుండెను. ఆతనికొడుకొకనాఁడు తండ్రి సింహాసనము నొద్దకు పరుగెత్తుకొనివచ్చి "ఈయుద్యోగులలో ఒక్కని పుత్రుఁడు మాయమ్మను తిట్టెను" అని కోపముతో చెప్పెను. అట్లు మర్యాదయెఱుఁగకుండ ప్రవర్తించిన వానికి, ఏ శిక్ష విధింపవలసి యుండు నని చక్రవర్తి ప్రధానులను అడిగెను.

ఆతనికి మరణశిక్ష విధింపవలయునని ఒకఁడు చెప్పెను. ఆతనినాలుక కోయింపవలయునని మఱి యొకఁడు చెప్పెను. ఆతనికి జరిమానా విధించి దేశమునుండి వెడలఁగొట్ట వలసినదని మఱియొకఁడు చెప్పెను.

పిమ్మట చక్రవర్తి తనకొడుకుతో నిట్లు చెప్పెను. "నాయనా! నాప్రధానులు చెప్పినమాటలు నీవు వినియున్నావు. కాని, మీయమ్మను దిట్టినవానిని నీవు క్షమించుటే సర్వోత్తమమని నా యభిప్రాయము. అట్లుచేయుటకు తగిన ఓరిమి నీకు లేని యెడల, ఆతని తల్లిని నీవు మఱలఁ దిట్టుము. కాని, ఆతఁ డెంత తిట్టు తిట్టెనో అంతే తిట్టుము. అంతకంటె ఎక్కువతిట్టిన యెడల నేరము నీయందే యుండును. 'మదించిన యేనుఁగుతో కలియఁబడి

పోరాడువాఁడు శూరుఁడుకాఁడు; పరులు తనయెడల చేసిన తప్పులకు కోపించి వారిని దిట్టకుండ ఓరిమివహించువాఁడే శూరుఁడు' అని ధీమంతులు పలికినారు. నాయనా! ఒక చిన్న కథనువినుము. ఒకతలతిక్క నిర్భాగ్యుఁడొకనినితిట్టెను. ఆతఁడందులకై కోపింపక 'సజ్జనుఁడా! నేను కొంత దుర్మార్గుఁడనని నీవు నన్నుఁదిట్టినావు. నిజమే! కాని! నాదోషము లన్నియును నాకుఁదెలియును. వారిలో కొన్నిమాత్రమే నీకుఁ దెలియును; కనుక, నే నెంతదుర్మార్గుఁడనని నీవనుకొంటివో అంతకంటె ఎక్కువదుర్మార్గుఁడను; నీవు నన్నుముందెప్పుడైనను తిట్టవలసి వచ్చినప్పు డీసంగతి మాత్రము రవంత జ్ఞప్తినుంచుకొనుము.' అనిపలికెను. నాయనా! ఓరిమివంటి సద్గుణము లేదు. నేనుచెప్పిన మాటవిని కోపమును దిగమ్రింగి నీశత్రుని క్షమింపుము."

ప్రశ్నలు:—1. చక్రవర్తితోఁ గొడుకేమని ఫిర్యాదు చేసెను? 2. అప్పుడు చక్రవర్తి, ప్రధానుల నేమని యడిగెను? 3. వారేమని చెప్పిరి? 4. చక్రవర్తి యభిప్రాయమేమి? 5. ఈపాఠమేమి నీతినిబోధించును?

మాటలు.—ఉద్యోగులు, జరిమానా, సర్వోత్తమము, తలతిక్క, నిర్భాగ్యుఁడు, దుర్మార్గుఁడు, జ్ఞప్తినుంచుకొనుము.

## 8. కుమ్మరి.

ప్రతి గృహమందును నీరు తెచ్చుటకు బిందెలుగాని, కుండలుగాని ఉపయోగింతురు. కొందఱు గిన్నెలతో అన్నము వండుకొందురు. మఱికొందఱు కుండలతో వండుకొందురు. బిందెలును, గిన్నెలును, ఇత్తడితో చేయునవి, కుండలు మట్టితో

చేయునవి.కుండలకు రేగడిమట్టి తప్ప మఱియొకటి పనికిరాదు. మంటిపాత్రలను కుమ్మరులు చేయుదురు.

మొట్టమొదట ఱాలును, పెంకులును లేకయుండు రేగడి మన్ను తెచ్చి, బెత్తికలుగా కొట్టుదురు. ఇసుక పాలులేని మట్టితో కుండలు చేసినయెడల పచ్చివిగా నున్నప్పుడే గాలికి బీటవాఱును. కనుక ఇసుక పాలులేని మట్టిలో మంచియిసుక కొంతకలిపి, నీరుపోసి, నానఁ బెట్టుదురు. దానిని చర్మము మీఁదఁ గాని, గోనె గుడ్డమీఁదఁ గాని ఉంచి, మెత్తగా త్రొక్కి, పిసికి ఱా లేమైనను ఉన్నయెడల తీసి పాఱవైతురు. అందువలన మట్టికి బల మెక్కువగును.



అట్టి మట్టిని మఱల రెండు మూఁడు సారులు బాగుగా త్రొక్కి సారెమీఁద వైచెదరు. తరువాత ఒక కఱ్ఱతో సారెను గిరగిర త్రిప్పెదరు. దీనినే కుమ్మరులు "వడివేయుట" యందురు. చక్రముతో దాని మీఁదనున్న మట్టికూడ తిరుగు చుండును. అప్పుడు కుమ్మరివాఁడా మట్టిమీఁద కొంచెము

నీరుచల్లి, దానిని చేతులతో ఒత్తి, లేవఁదీసి, యేరూపము గావలెనన్న ఆరూపమునకు తెచ్చును. తరువాత, సారె తిరుగుచుండఁగానే ఆపాత్రను బద్దతో సాపుచేసి, తడిగుడ్డతో నునుపుచేసి, దారముతో కోసి, నేలపై నుంచును. దీని యడుగుభాగము గూడ, పైభాగము వలెనే తెలుచుకొని యుండును. ఇట్లు సారె మీఁది మన్నంతయు అయిపోవువఱకు సరకులు చేయును.

ఇట్లు చేసినపాత్రలను ఆఱఁబెట్టి, చేయివేసినప్పుడు సొట్టపడకుండు పదనున ఉన్నప్పుడు ఒక్కొక్కపాత్రను దీసికొని,నున్నని ఱాయి, లోపలనుంచిపట్టుకొని, పైనొక దళసరిబల్లతో చేఱచి తెఱచుకొనియున్న అడుగుభాగములను జాగ్రతగా కప్పి వేయుదురు. తరువాత పలుచని బల్లతో నునుపు చేయుదురు.

వీనిని గాలి తగులనిచోట ఆఱఁబెట్టి, ఆవములో పేర్చి కాల్తురు. ఆవముప్రక్కను ఒక అడ్డుగోడ యుండును. దానికి రెండు పొయులుండును. వీనిలోనుండి ఆవమునకు నిప్పంటింతురు.

ఆవము చుట్టును 'రేవు' లుండును. రేవు లనఁగా పగిలిన కుండముక్కలతో ఏర్పఱచినరంధ్రములు. వీనిలోనుండి గాలి పోవును. కుండలు సరిగా కాలినవో లేవో చూడవచ్చును. వేఁడిమిపోకుండ ఆవముపైని గడ్డివేసి తడిపినమసితో మెత్తుదురు.

ఆవము కాలినతరువాత, నల్లకుండలు కావలసిన యెడల రేవులును పొయ్యిలును మూసివేయుదురు. ఎఱ్ఱవి కావలసిన యెడల వానిని తెఱచియుంతురు.

కుండలు, బానలు, మూఁకుళ్లు ప్రమిదలు, నూతి ఒఱలు నాగవల్లిపిడుఁతలు మొదలగునవి కుమ్మరిచేయు సరకులు

ప్రశ్నలు:—1. మట్టిలో నిసుక యేల కలుపుదురు? 2. పడివేయుట యని దేనికిఁ బేరు? 3. రేవులని వేనికిఁబేరు? వాని యుపయోగ మేమి? 4. ఆవమును గడ్డితోను, మసితోను గప్పుటకుఁ గారణమేమి? 5. ఎఱ్ఱకుండ లెట్లు చేయుదురు? నల్ల వెట్లు చేయుదురు?

**మాటలు**— బెత్తిక, సారె, సొట్టపడు, చేఱచుట, ఆవము.

---

# 9. ఋతువులు.

సంవత్సరమునకు పండ్రెండు మాసము లని యిదివఱకే చెప్పితిమి కదా. రెండేసి మాసములు కలిసి యొక్క ఋతు వగును. కనుక సంవత్సరమునకు ఆఱు ఋతువులు.

చైత్రవైశాఖ మాసములు వసంతఋతువు. ఇది దాదాపుగా 'ఏప్రిల్, మే' నెలలలో పడును. చెట్లు చిగుర్చును. మల్లె మొదలగు పూవులుపూఁచి చూచుట కెంతో శృంగారముగా ఉండును. ఈఋతువు యొక్క అందమును కవీశ్వరులు విశేషముగా వర్ణింతురు.

ఎండలు క్రమ క్రమముగా ముదరి వేఁడిగాడుపులు వీచుటకు ప్రారంభించును. జనులకు చల్లని మంచినీళ్లపై అపేక్ష పుట్టును. మామిడిపండ్లును, పనసపండ్లును, అమ్మకమునకువచ్చుచుండును. మంచి గంధముతోను, విసనకఱ్ఱలతోను, మామిడి పండ్లతోను పనస తొనలతోను, వడపప్పుతోను, పానకముతోను సంపన్నులు వైశాఖ పూజలు చేయుదురు.

జ్యేష్ఠాషాఢమాసములుగ్రీష్మఋతువు.ఇదిజూన్, జూలై నెలలలో వచ్చును. గ్రీష్మమన్నను వేసఁగి అన్నను ఒకటేఅర్థము.

వేడిమియు వడగాడ్పులును హెచ్చును పగలు నడచిపోవు మార్గస్థులు ఒక్కొక్కప్పుడు వడగొట్టి చచ్చిపోవుదురు. ఇండ్లలోనివారుసైతము పెదవులెండి యెండవేళను ఆపసోపాలు పడుచుందురు. తినుటకు కూరగాయలు సాధారణముగా దొరకవు. మామిడిపండ్లు, పనసపండ్లు, తాటిముంజెలు విశేషముగా నుండును.

తొలకరివానలు కురియును. కొన్నిచోట్ల వైశాఖమునందే తొలకరించును. చివరభాగమున నైరృతి దిక్కునుండి వర్షములు కురియుటకు ఆరంభించును. పశ్చిమ దక్షిణములను కలుపుమూలనైరృతిదిక్కు. ఈవర్షములు కురియుటకు ముందు ఉక్కపోసి ఒడలు తెక తెకలాడును. వర్షించినతోడనే ప్రాణము హాయిగాఉండును.

ఈఋతువులో వరియాకు పోయుదురు. ఋడమలు విత్తుదురు. మొక్కజొన్న వేయుదురు. కంది ఆరుగలు కలిపి చేల్లుదురు. నువ్వులు, చామలు, సజ్జలు, చోళ్లు మొదలగునవి చేల్లుదురు. వీనిని పునాస లందురు. సూర్యుడు పునర్వసు నక్షత్రమందుండఁగా చేల్లునవి గనుక వానికి 'పునాస' లని పేరు వచ్చియుండును.

శ్రావణ భాద్రపదములు వర్షర్తువు. వర్షములు మెండుగాఁ గురియు కాలముగాన దీనికి అట్టి పేరు పెట్టిరి. ఇది ఆగస్టు సెప్టెంబరు నెలలలో వచ్చును.

వర్షాకాలములో పొట్ల, బీర, ఆఁగాఁకర, బెండ, దోస మొదలగు కూరగాయలు కాచుటకు ఆరంభించును. పెరిఁగిన వరియాకు నీరుపెట్టి ఊడ్తురు.

సువాసన ఇచ్చు పుష్పాడి వర్షముతో కొట్టుకొని పోవును. కాన, ఈకాలమందలి పూవు లంతగా పరిమళింపవు

వెనుక వేసిన నూవులును మొక్కజొన్నలును కోఁతకు వచ్చును. బజారులలో కుంపట్లమీఁది మొక్కజొన్న పొట్టల పెటపెటలు వినఁబడు చుండును. కాచుచున్న మొక్కజొన్న గింజెల కమ్మనివాసనలు దారిని పోవువారి నాసికలకు విందు చేయుచుండును.

ఆశ్వయుజ కార్తిక మాసములు - అక్టోబరు, నొవెంబరు నెలలు - శరదృతువు. వర్షములు అఁగును. వర్షాకాలములో కలుషము లైన నదీ తటాకజలములు కలఁక దేఱి స్వచ్ఛముగా నుండును. ఆకాశము నిర్మలముగా నుండును. శరత్కాలపు వెన్నెల ఎంతో మనోహరముగా నుండును.

దాదాపుగా పునాసపైరు లన్నియు పండును. కూరగాయలు సమృద్ధము లై యుండును.

పెద్దవర్షములు మానినను, ఈశాన దిశనుండి చిన్న వర్షములు కురియుటకు ఆరంభించును. ఉత్తరమునకు తూర్పునకు నడుమనుండు మూల ఈశానదిశ.

నెల్లూరు ప్రాంతమువారికి ఈవానలే మెండుగా నుండును; కనుక, వారిప్పుడు ఆకుమళ్లు వేసి వరి యూడ్తురు.

మిరెప మొక్కలు, చిఱుజొన్నలువేసెడు కాల మిదియే. ప్రత్తియు ఇప్పుడే విత్తుదురు. అది గ్రీష్మర్తువులో కోఁతకు వచ్చును.

దసరా పండుగలలో బాలురును బాలికలును గిలకలును విల్లమ్ములును పట్టుకొని, కలిసి చేరి పాటలుపాడుచు

ఇంటింటికి పోవుచుందురు. పూర్వరాజులు శరదృతువులో దండయాత్ర లేగెడువా రని యిది సూచించునఁట.

మార్గశిర పుష్యములు – డిసెంబరు, జాన్యూఅరి నెలలు– హేమంత ఋతువు. అనఁగా మంచుకాలము. ఈ ఋతువులో జనులు చలి చేత, మిక్కిలి బాధపడుదురు.

వర్షర్తువులో ఊడ్చిన వరి కోఁతకు వచ్చును.

పెసలు, మినుములు, ఉలవలు, సెనగలు మొదలగు పైరులు పెట్టుదురు.

మాఘ ఫాల్గునములు – ఫెబ్రూఅరి, మార్చి నెలలు–శిశిర ఋతువు. అనఁగా చల్లని ఋతువు. ఔనుగాని చలి యంతగా నుండదు. ఋతువు చివర, అప్పుడే వేఁడి కొంచెము ప్రారంభించును.

వెనుకటి ఋతువులో పెట్టిన పైరులన్నియు కోఁతకు వచ్చును. జొన్న, మిరెప, కంది చేనులుగూడ కోఁతకువచ్చును. అవి కోసి క్రొత్తగా నూవులు చల్లుదురు. ఈనూవులు గ్రీష్మర్తువులో ఫలించును.

పెద్దవరి, కందులు, ప్రత్తి–ఇవి పండుటకు సుమారు ఆఱు మాసములు పట్టును తక్కినవి మూఁడు నాలుగు నెలలలో పండును.

ప్రశ్నలు:— 1. ఊడుపువరి, కంది, ప్రత్తి—ఇవి యెప్పుడు వేయుదురు? ఎప్పుడు కోయుదురు? 2. శీఘ్రముగాఁ బండుధాన్యము లేవి? 3. మనకు ముఖ్యమైనవర్షము లే యేపైపులనుండి వచ్చును? అందులో నేవర్షము నెల్లూరిజిల్లావారి కెక్కువ? 4. కొన్ని గ్రీష్మర్తు ధర్మములను, కొన్ని హేమంత ఋతు ధర్మములను జెప్పుము? 5. శరదృతువులో వేయు పైరు లేవి? 6. ఏయే చేలు చివర ఋతువులో కోఁతకు వచ్చును? ఆ ఋతు వేది?

మాటలు,—అపేక్ష; గ్రీష్మము, ఆపసోపాలు, తెకతెకలాడు, విత్తుట, పునాసలు, నాసిక, కలుషములు, మనోహరము, సమృద్ధము, దండయాత్ర.



## 10. రామాయణ కథాసంగ్రహము.

రాజులు, చంద్రవంశజులనియు సూర్యవంశజులనియు రెండు తెగలుగా ఉన్నారని వెనుకటి వాచక పుస్తకమునందు చెప్పఁబడియున్నది. చంద్రవంశపు రాజులకు చంద్రుఁడు మూలపురుషుఁడైనట్లే సూర్యవంశపు రాజులకు సూర్యుఁడు మూలపురుషుఁడు. సూర్యవంశపు రాజులలో ఇక్ష్వాకుఁడు, మాంధాత, రఘువు, దశరథుఁడు మొదలగువారు మిగుల ప్రసిద్ధులు కాని, దశరథపుత్రుఁడైన శ్రీరాముఁడు వీరందఱికంటె గొప్పవాఁడు. ఇతని చరిత్రమే రామాయణము.

దశరథునకు కౌసల్య, సుమిత్ర, కైకేయి అను ముగ్గురు భార్యలు. కౌసల్యకు రాముఁడును, సుమిత్రకు లక్ష్మణ శత్రుఘ్నులును, కైకకు భరతుఁడును పుట్టిరి. రాముఁడు చిన్నతనముననే తాటకను చంపి విశ్వామిత్రుని యజ్ఞమును సంరక్షించెను. శివధనుస్సును విఱిచి జనకునికూఁతురగు జానకిని పెండ్లి చేసికొనెను.

రామునకు తగినవయసు రాఁగానే దశరథుఁ డతనికి పట్టాభిషేకము చేయ ప్రయత్నించెను. రాముని సవతితల్లియగు కైక అందులకు సమ్మతింపక తనకు పూర్వమున దశరథుఁ డిచ్చిన వరములను ఇప్పుడు కోరుకొనెను. రాముఁడు పదునాలుగేండ్లు అరణ్యవాసము చేయవలయుననునది మొదటి వరము. భరతునకు పట్టాభిషేకము చేయవలయు ననునది రెండవవరము. సత్యబద్ధుఁడగు ముసలిరాజు, రామవనవాసమునకు అంగీకరించెను.

దశరథుఁడు పుత్రశోకముచే మరణించెను. అతనికి అగ్నిసంస్కార మొనర్చుటకు ఒక్కపుత్రుఁడైనను దగ్గఱ లేఁడు. రామలక్ష్మణు లరణ్యమున నుండిరి. భరతశత్రుఘ్నులు తాతగారి యింటియొద్దనుండిరి. వసిష్ఠుఁడు భరతశత్రుఘ్నులను పిలిపించెను.

భరతుఁడు పితృకర్మ మొనరించిచిత్రకూటమునకు పోయి 'పురమునకు వచ్చి రాజ్యము నేలుకొనుము' అని రామునిఁ గోరెను. రాముఁ డంగీకరింపక తన పాదుకలనిచ్చి వానిని ముందుంచుకొని నీవే రాజ్యమేలుచుండుమని భరతునకుఁ జెప్పి పంపివేసెను.

రాముఁడు దండకారణ్యమున అనేకఋషుల సేవించి వారి యనుగ్రహమును పొందెను. అనేక రాక్షసులను చంపిమునుల

కష్టముల వారించెను. ఒకనాఁడు శూర్పణఖ యను రాక్షసస్త్రీ
రాముని మోహించి జానకిని మ్రింగుటకు సిద్ధపడెను. రాముఁడు
ఆరాకాసి ముక్కు చెవులు లక్ష్మణునిచే కోయించెను. ఆమె
యేడ్చుచు అన్నయగు రావణాసురునితో తనకు జేరిగిన పరా
భవమును గూర్చియు జానకి సౌందర్యమును గూర్చియు
చెప్పెను. రావణుఁడు సీతను హరింపఁ దలఁచెను. సన్న్యాసివేష
మున పర్ణశాలకు వచ్చి రామ లక్ష్మణులు లేని సమయమున
సీతను దీసికొని లంకలోనికి పాఱిపోయెను

రాముఁడు భార్యకొఱకు మిగుల దుఃఖించెను. ఆమెను వెద
కుచు దక్షిణముగా బయలుదేరెను. పోయిపోయి సుగ్రీవుని
పట్టనమగు కిష్కింధకు ఆతఁడు లక్ష్మణునితో వచ్చెను. సీత,
రావణవిమానమునఁ బోవుచు పైనుండి అక్కడ పడ
వైచిన నగల మూటను రామునికి సుగ్రీవుఁడు చూపెను.
రాముఁడు మిగుల ఖేదపడెను. సుగ్రీవునితో సఖ్య మొనర్చెను.
సుగ్రీవుని విరోధియు అన్నయునగు వాలిని జంపెను. సుగ్రీవ
భటులగు కోఁతులచేత అన్నిదశలయందును సీతను వెదకిం
చెను. ఆమె రావణునిచే హరింపఁబడి లంకలో ఉన్నదని
స్పష్టముగా తెలిసి ఆంజనేయుఁడు సముద్రమును దాఁటి,లంక
కేగి, సీతనుగాంచి, రాముముద్రిక ఆమెకిచ్చి, లంకఁగాల్చి,
అనేక రాక్షసులఁ జంపి, రామునకు సీతావార్తను జెప్పెను.
రావణునిఁ జంపి సీతను దెచ్చుకొనుటకు రాముఁడుద్దేశించెను.

సుగ్రీవుఁ డనేకకోటుల కోఁతులతో రామునకు సాహాయ్య
మొనర్చెను.

కుంభకర్ణుఁడని, విభీషణుఁడని రావణునకు ఇద్దఱు తమ్ములు. సీతను రామునకు అర్పించు ఆతనితో సఖ్యము చేసికొనుమని విభీషణుఁడు రావణునకు బోధించెను. రావణుఁడు అందులకు సమ్మతింపక విభీషణుని అవమానించెను. లంకను విడిచిపెట్టి విభీషణుఁడు శ్రీరాముని శరణుచొచ్చెను.

సేతువును కట్టించి రాముఁడు సుగ్రీవ విభీషణాదులతో లంకలో ప్రవేశించి రావణుని పుత్రమిత్ర బంధువులతో వధించెను. విభీషణుని లంకకు పట్టాభిషిక్తుని చేసెను.

సీతను గ్రహించి ఆమెతో అయోధ్యకేగి రాజ్యమున పట్టాభిషిక్తుఁడై చిరకాలము రాజ్యము చేసి పుత్రులగు కుశలవులకు యుక్తకాలమున పట్టాభిషేకములు చేసి వైకుంఠమున కేగెను.

రామాయణమును వాల్మీకి వ్రాసెను. విశ్వామిత్రుఁడు వ్రాసిన రామాయణమునకు అధ్యాత్మరామాయణ మని పేరు. రామాయణగాథను అనేక కవులు నాటకములుగను; పద్యకావ్యములుగను, వచనకావ్యములుగను, పాటలుగను, ద్విపదలుగను వ్రాసిరి. హిందూదేశమున రామాయణమంత వ్యాప్తిని చెందిన గ్రంథము మఱియొకటి లేదు.

రామునివంటి మహావీరుఁడు లేఁడు. భరత సౌమిత్రులవంటి తమ్ములు లేరు. సీతవంటి కాంత లేదు. సుగ్రీవునివంటి సఖుఁడు లేఁడు, ఆంజనేయునివంటి బంటు లేఁడు.

ప్రశ్నలు:—1. సుమిత్రకొడుకులెవ్వరు? 2. భరతుని తల్లి పేరేది? 3. రామునిభార్య పేరేది? 4. తండ్రి రామునడవికిఁబంపుటకేమికారణము? 5. శూర్పణఖను రాముఁడేల శిక్షింపఁజేసెను? 6. శిక్షనుబొంది శూర్పణఖ

యేమి చేసెను? 7. సుగ్రీవునకు సీతమ్మ నగలమూట యెట్లు వచ్చినది? 8 రావణుని సోదరు లెందఱు?

మాటలు.—యజ్ఞము, అరణ్యము, పట్టాభిషేకము, వచన కావ్యము, వ్యాప్తి.

---



## 11. రాబందు.

కుక్కగాని, పిల్లిగాని చచ్చినచో దానిని ఊరి బైటికిలాగించి వైతుముగదా! దానిమాంసమును తినుటకు అయిదాఱు పెద్దపక్షులు ఎక్కడనుండియో వచ్చి, ఆకళేబరము చుట్టును నిలఁబడి, చంచువులతో దానిని పొడిచి తినుచుండుట కని యుందువు. మాలపల్లెలకు సమీపమున కొబ్బరచెట్లమీఁదనో, తాటిచెట్లమీఁదనో అవి కూరుచుండి యుండుటను జూచియుందువు. చెట్లమీఁద వ్రాలినప్పుడు ఆకులు జెవ్వున వంగి చప్పుడగుటయు వినియుందువు. ఆడపక్షులనే రాబందు అని చెప్పుదురు.

రాబందు మాంసాహారి. ప్రపంచమం దంతటను ఉండును. సాధారణముగా కొండలమీఁద గూండ్లు కట్టుకొనియుండును.

దాని చంచువు వంకరగా కొనదేఱి యుండును.

కాళ్లు బలముగా నుండునుగాని, గోళ్లు గట్టివి కావు. అందు చేత అది జంతులను గోళ్లతో తన్నుకొని పోఁజాలదు. ముక్కునఁ గఱచుకొని పోవును.

దానికి తలమీఁదను, మెడమీఁదను ఈఁక లుండను. పొడవైన మెఱకలుండును. తోఁక పొట్టి. రంగు గోధుమరంగు.

రాబందులలో కొంచెము తెల్లవి కూడ నుండును. రాబందు చూచుటకు వికారముగా నుండును.

అది దాదాపు మూఁడడుగుల పొడవుండును.

అవి ఆకాశమున ఎత్తుగా చక్రాకారమున తిరుగుచుండుట మక్కిలి వినోదముగానుండును. కొంతవఱకు రెక్కలతో కొట్టు కొనినఁగాని రాబందు పైకెగురలేదు. అది బరువైన పక్షి.

ఎంత దూరముననున్న మృతకళేబరము నైనను రాబందు సులభముగా చూడఁగలదు, ఒక రాబందు రాఁగానే యెక్కడ నుండియో మఱికొన్ని వచ్చి అక్కడకుఁ జేరును.

రావణుఁడు సన్న్యాసి వేషమునవచ్చి సీతాదేవిని తీసికొని పోయినట్లు మీరు చదివియున్నారు. అట్లు తీసికొని పోవుచుండఁగా త్రోవలో జటాయువను పక్షిరాజము, వానిని ఎదు ర్కొని ఘోరయుద్ధము చేసి పడిపోయెను. శ్రీరామునికి అతఁడు బంధువువలె పోరాడెను గాన, అతని జాతిపక్షులకు రామ బంధువు లని పేరువచ్చెను. "రామబంధు" యొక్క తెలుఁగు రూపమే రాబందు.

ప్రశ్నలు:—1. రాబందుల నెక్కడఁజూచితివి? 2. అవి యెట్లుండును? 3. రాబందున కాపేరెట్లు వచ్చినది?

మాటలు.—కళేబరము, చంచువు, దృఢము, ఎఱక, వినోదము, సులభము, పక్షిరాజము.

---

## 12. పదార్థస్థితులు.

ప్రపంచములోని వస్తువులన్నియు మూఁడు రకములుగా నున్నవి. గోలీకాయ, ఇనుపగుండు, కఱ్ఱముక్క, మంచుగడ్డ ఇవి గట్టిగా నుండును. వానిని ఎంతనొక్కినను చిన్నవికావు. ఆమట్టునుంచి వాని ఆకారములను మార్పలేము. ఇట్టి వానిని ఘనపదార్థము లందురు. ఘనపదార్థములనఁగా గట్టివస్తువులు.

నూనె, పాలు, సారాయి, పాదరసము, నీరు ఇవి పలుచేగా నుండి, క్రిందఁబోసిన నొకచోట నిలువక పాఁకిపోవును. ఘనపదార్థముల వలెనే, ఇవి యెంతనొక్కినను తక్కువగావు. తప్వేఁడు నీటిని ఎంత అదిమినను సోలలో పట్టింపలేము. కాని, ఆకారమును మాత్రము సులభముగా మార్పఁగలము. సోలలోఁబోసిన నీరు సోల ఆకారముగా నుండును. అనీరే తొట్టిలోఁ బోసినఁ దొట్టిరూపము తాల్చును. పళ్లెములో నుంచినఁ బళ్లెము రూపమును గ్రహించును. ఇట్టి వానిని ద్రవపదార్థము లందురు. ద్రవపదార్థములనఁగా నీరువలె కాఱెడు వస్తువులు.

గాలి, ఆవిరి ఇవి కనులకు అగపడవు, వీనిని స్పర్శమువలననే తెలిసికొనఁగలము; రంగును వాసనయుఁగలవి కొన్నియున్నవి కాని, తఱచుగా లేవు. గాలికి ఒక్కయాకారముగాని, పరిమితి

గాని లేదు. బరువుమాత్ర మున్నది. దీనిఁ బట్టి అదియును ఒక పదార్థమని యెఱుఁగఁగలము. చిన్నతిత్తిలోఁగాలి పెద్దతిత్తిలోఁ బోయవచ్చును, దానినే యొక గదినింప వ్యాపింపఁ జేయవచ్చును. ఇట్టి వానిని వాయుపదార్థము లందురు. వాయుపదార్థములనఁగా గాలివంటివస్తువులు.

వెన్న ముద్దను కరఁగించి చూడుము. వేఁడి తగిలిన కొలఁది అది ద్రవించి, ప్రాఁకి నేయి యగును. ఇంకను కాచినయెడల విరివియై ఆవిరిగామాఱి ఎగసి పోవును.

నేయి చల్లపఱిచినయెడల పేరుకొని ముద్దయగును. విస్తీర్ణములనఁగా విరివిహెచ్చి పెద్దవిఅయినవి. సంకుచించుట అనఁగా ముడుఁచుకొని చిన్నవి అగుట. కనుక వేఁడిమివలన సాధారణముగా వస్తువులు విస్తీర్ణము లగును. శైత్యమువలన సంకుచించును.

ఒకే పదార్థమే పై మూఁడుస్థితులలోను ఉండవచ్చును. మనము నిత్యము ఉపయోగపఱచుకొను నీరు ఇట్టిదే. నీటిఆవిరివాయుపదార్థము. నీరుద్రవపదార్థము. మంచు గడ్డఘనపదార్థము.

నీటి యావిరిపై చల్లనిపలకగాని పళ్లెముగాని పెట్టికొంచెము సేపుంచినయెడల, దానిఁ అడుగునజలబిందువు లెన్నోయేర్పడి కాఱుచుండును. నీటికి తగినంత శైత్యమును కలుగఁజేసిన యెడల నీరుగడ్డకట్టి మంచేగును. పెద్దపట్టణములలోను రెయిలుబండ్లలోను, వేసఁగిలో అమ్ము మంచుగడ్డలు ఇట్లుచేసినవే.

మంచుగడ్డలో ఒక విశేషము గలదు. ద్రవపదార్థములు ఘనపదార్థములుగా మాఱునప్పుడు సంకుచించి, విస్తృతిలో తగ్గును. కాని, నీరు మంచుగడ్డయగునపుడు విరివిలో హెచ్చును.

మంచుగడ్డముక్క, నీటిలో పడవేసిన యెడల, దానిపైని తేలునుగాని అందులో మునుఁగదు. ఇది పై సంగతి యథార్థమని రుజూవుపఱుచును.

ప్రశ్నలు:—1. పదార్థము లెన్నివిధములు? 2. ద్రవపదార్థములెట్టివి? 3 వాయు పదార్థధర్మము లేవి? 4. వేఁడిమివలన ఘనపదార్థము లెట్టివస్తువులుగా మాఱును? 5. శైత్యమువలన వాయుపదార్థము లెట్టిపదార్థము లగును? 6 దేనివలన వస్తువులు విస్తీర్ణములగును? దేనివలనఁ గుదిసిపోవును? 7. మంచుగడ్డ నీటిలో వేసినయెడల మునుఁగునా? తేలునా?

మాటలు.—స్పర్శము, పరిమితి, ద్రవించు, విస్తీర్ణము, విస్తృతి, సంకుచించు, ఘనపదార్థము, ద్రవపదార్థము, వాయుపదార్థము.

---

## 13. ప్రభువు, బానిస.

సంతలో పశువులను అమ్మినట్లు పూర్వదినములలో మనుజులను విక్రయించు దురాచారముండెను. బలవంతులగు వారు బలహీనులపై దండెత్తి వారినోడించి వారిలోని స్త్రీపురుషులను బానిసలుగాఁ దీసికొని బజారులో కూరలమ్మినట్లితరులకు విక్రయించుచుండెడివారు; ఇట్టి భయంకరమగు అచారమిప్పుడు ప్రపంచమునందు దాదాపుగా అన్ని దేశములందును నశించినది.

ఆదినములలో ఒకఁడొక బానిసవానిని గొని వానిచే సేవ చేయించుకొనుచుండెను. ఆబానిసవాఁడు విధేయుఁడుగను మంచివాఁడుగను ఉన్నట్లేయుండి, ఒకనాఁటిరాత్రి తన ప్రభునికి తెలియకుండ లేచి కొంతసొమ్మును దొంగిలించి పాఱిపోయెను.

విశేషధనమిచ్చి వానిని గొనియుండుటచేత వానినెట్లయినను తిరుగఁ బట్టుకొనవలయునని యెంచి ప్రభువ నేకజనులను అనేక

స్థలములకు పంపెను గాని, వానిజాడను వారు గానలేకపోయిరి. వానిని వెదకుటకై తుదకుఁ దానేబయలుదెఱెను. కష్టపడియొక దూరదేశములో వానిని బట్టుకొనెను.

కాని, వాఁడిప్పుడు బానిసవలె లేఁడు. మంచి దుస్తులను గట్టుకొని వేషము మార్చియుండెను. ఎట్లున్నను ప్రభువు వానిని ఆనవాలుపట్టి చేయిపట్టుకొని "నీవు నాబానిసవు. మనయూరు పోదము రా"! అని గద్దించెను.

ఆబానిస యీమాటలు విని మిక్కిలి కోపముతో "ఓరీ తుచ్ఛుఁడా! నీకు నేను బానిసనా? అంత కన్నులు నెత్తికి వచ్చినవా? నాబానిసవై, నా కాళ్లుగడిగి, సేవచేసిన నీవు నాకేప్రభుఁడవని పలుకుచున్నావా! చూడు! నిన్నేమిచేసెదనో" యని కన్నులెఱ్ఱచేసి యఱచెను.

అంతలో అనేకజను లక్కడఁ జేరిరి. బానిసవాని వేషభాషలు చూచి వాఁడేప్రభుఁడని జనులు కొందఱనుకొనిరి. పాపమా ప్రభువేమిచేయఁగలఁడు? దూరదేశములోఁ దనగౌరవమును సత్యమును ఎఱిఁగినవా రెవరున్నారు? బానిసను వదలి వైచుట కిష్టము లేక ఆయూరిలోని న్యాయాధిపతియొద్ద ఫిర్యాదు చేసెను.

'వీఁడు నాబానిస' యని ప్రభువనెను. 'వీఁడు నాబానిస' యని బానిసయనెను. న్యాయాధికారి యెవని మాటలను నమ్మగలఁడు? ఇద్దఱకునుగూడ సాక్షులు లేరు.

అంతట న్యాయాధికారి వారినిద్దఱను ఒక కిటికీ యొద్ద నిలువఁ బెట్టించి మెడలను ముందునకుఁబెట్టించి క్రిందికిఁ జూడుఁడని యాజ్ఞాపించెను; వా రట్లు చేసిరి.



అప్పుడాతఁడు తలారినిబిలిపించివారి ప్రక్కను నిలువఁబెట్టించి "తళుకు మనునంతలో నీచేతనున్న కత్తితో వీరిలో బానిస వానితల నఱుకవలయును" అని బిగ్గరగా వాని కాజ్ఞాపించెను.

ప్రభువు తనతలను కదలుపనేలేదు. బానిసవాఁడు తనతలను వెనుకకు లాగుకొనెను. న్యాయాధికారి బానిసను కనిపట్టి వానిని ప్రభువున కిప్పించెను.

ప్రశ్నలు:—1. బానిసవాఁడు నమ్మకముగ నున్నట్లేయుండి యేమి చేసెను? 2. ప్రభువు బానిసను బట్టుకొన్న తరువాత బానిస యేమనెను? 3. ప్రభువెవఁడో బానిసయెవఁడో న్యాయాధికారి యెట్లు కనిపట్టెను?

మాటలు.—దురాచారము, విధేయుఁడు, ఆనవాలు, గద్దించెను, తుచ్ఛుఁడు, వేషభాషలు, గౌరవము, సాక్షి, గవాక్షము, తలారి.

## 14. వరిచేను.

### మొదటి భాగము.

నీటి వసతిగలిగి, విశేషము గడ్డిపట్టని మళ్లను జూచి యొగువు వేసి రెండుమూఁడు వానలు కురియఁగానే ఆకు పోయుటకు

ఆవుళ్లను మెత్తగాను గుల్లగాను దున్నుదురు. నేల మెత్తగా దున్నుటవలన గడ్డి పట్టదు. తేమ ఆఱిపోవకుండుటచే, ఆకు ఏపుగా పెరుఁగును. చేల్లినవిత్తనములు బీఱుపోవక అన్నియు మొలచేను.

ఆకుమళ్లు చేక్కఁగా దున్నిన పిదప మంచి విత్తనములు తెచ్చి ఒత్తుగా చేల్లుదురు. ఆకు పోయుటవలన మొక్కలు దట్టముగా నుండునుగాన. నడుమ గడ్డిపుట్టఁజాలదు. కొంచెము స్థలములోనే పోయుదురుగాన, ఆకును ఎక్కువ జాగరూకతతో పెంచుటకు వీలుండును. మొదట ఆకుపోసి. తరువాత, దానిని ఊడ్చినయెడల మొక్కలు క్రొత్తవేరులు పోసికొనును. చేను బలముగా పెరుఁగును. పంట అధికముగా పండును.



ఆకు పెరుఁగునప్పటికి పెద్దవానలుకురిసి వఱదలువచ్చేను. నీరు పొల మంతకునుబెట్టి, మళ్లు దమ్ముచేయుటకు ప్రారంభింతురు. ఆకుమళ్లకుఁ గట్టిననీటిచే నేలఅంతయునానును. అందుచేత ఆకు సులభముగా ఊడఁదీయువచ్చేను. పొలమునకు ఎరువు

వేసినను, వేయక పోయినను, తటి తప్పక యూడుపు చేయవల యును. కాలమునకు, ఊడ్చినచే లే పూర్ణమైన పంటనిచ్చును.

కూలివాండ్రు, ఆకుతీసిక ట్టలు కట్టుచు, మడిలోనే యుంచి వేయుదురు. మఱికొందఱు ఆకట్టలను, దమ్మైన మళ్లలోనికిఁ దీసి కొనిపోయి, యేడెనిమిది అంగుళముల దూరమున ఒక్కొక్క మొక్క ఊడ్చెదరు.

ఊడ్చినకొలఁదికాలములోనే, మొక్కలు వేరునాటు కొనును. ఊడ్చినప్పుడు కొంచెమువాడినట్లగపడినవి ఇప్పుడు ఆకుపచ్చపడి చూచుటకెంతో ఇంపుగా నుండును. గాలికి చేనంతయును, సొగసుగాపడుచు లేచుచునుండును. అప్పుడదిచిన్న యలలతోఁ గూడిన సముద్రమువలె సుందరముగా నుండును.

అప్పుడప్పుడు నిలువనీటినిపల్లపుమళ్లమీఁదుగా మురుగుడు కాలువలలోనికి విడిచిపెట్టి క్రొత్తనీటిని బెట్టుదురు. ఆనీటిలో నున్న పదార్థములను చేనుదీసికొని, మఱింత బాగుగా పెరుఁగును.

వరియూకు ఊడ్చిన నెల, నెల పదిరోజులకు చేలిలో అక్క డక్కడ గడ్డి బయులుదేఱును, ఆగడ్డిని ఊడఁదీసి వేయని యెడల కొంతబలమును అది దీసికొనును. కనుక సస్యము బాగుగా ఫలింపదు. ఈ గడ్డి మొక్కలను ఊడ లాగివేయుటే కలుపు తీయుట యందురు. అది యుక్తకాలములోనే చేయవలెను. అట్లుచేయక వరిమొక్కలు కనుపులువేసి చిఱుపొట్టలతోనున్న ప్పుడు కలుపుదీయుటకు చేనిలో ప్రవేశించిన యెడల చేను విఱిగి పాడై పోవును.

ప్రశ్నలు:—1. ఆకు మళ్లెట్లు బలపఱుపవలెను? 2. నేల మెత్తగా నుండుటవలన లాభమేమి? 3. ముందుగా ఆకుపోసి, నారయూకును విడఁదీసి

యూడ్చుటవలనఁ బ్రయోజనమేమి? 4. ఆ కెట్లూడ్తురు? 5. పొలమునకుఁ గ్రొత్తనీరు కట్టుచేయుటవలన లాభమేమి?

మాటలు.—వసతి, ఎఱువు, తేమ. బీఱుపోవుట, వఱద, తఱి, ఇంపు, అల, ముఱుగుడుకాలువ, చిఱుపొట్ట, సస్యము.

---

## 15. వరిచేను.

### రెండవభాగము.

కలుపు దీసినతరువాత కొన్నాళ్లకు చేను ఈని, వెన్నులు వేయును. వెన్నులలో గింజలు పాలు పోసికొని ముదిరి గట్టి పడును. ఇప్పుడు వరిపొలము చూచుట కెంతో యందముగా నుండును. ఇంతకుముందు పట్టెదిగా నుండి విఱ్ఱవీఁగుచేను ఇప్పుడు నిండు కంకుల భారమున, గర్వరహితుఁడై సంపన్నునివలె నమ్రత వహించి యుండును.

ఇంతట వానలు వెనుకఁబట్టి, శీతకాలము ప్రవేశించును. చేలుపండి పచ్చగా నుండును. ఇట్టి సమయమున చేనిలో నీ రెంతమాత్రమును ఉంపక తీసివేయుదురు. కాలయాపనము చేసినచో కంకులనున్న గింజలు రాలిపోవునుగాన, పైరుకోసి, పనలుగా వేయుదురు. రెండుమూఁడు రోజులు మంచునఁదడిసి, యెండకు ఆఱినపిదప. పనలను కట్టలుగా కట్టి కుప్పలుగా వేయుదురు.

కోఁతలు కోయునప్పుడు కూలివాండ్రెంతో ఉల్లాసముతో చేక్కనిపాటలు పాడుచుందురు.

కాఁపులకు తీరుబడి యైనప్పుడు కుప్పలు నూర్తురు, వేసిన కుప్పలను పడఁద్రోసి యెద్దులను, పోతులను బంతులు కట్టి

వానిచేత త్రొక్కింతురు. ఇట్లు చేయుటవలన కంకులనుండి



వడ్లు విడిపోవును, కుప్పలునూర్చునప్పుడు కూడ పాటలు పాడుదురు. సాధారణముగా వెన్నెల రాత్రులందు నూర్తురు. నూర్చినధాన్యమును ఎగురఁబోసి, రాసులువేయుదురు. ముందు విత్తనములకును సంవత్సర గ్రాసమునకును, ఖర్చులకును కావలయు ధాన్యము కాక, మిగిలినపంట అమ్మివేయుదురు. విత్తనములు పాడై పోకుండ, పురులుగాని, ముడియ కట్టలుగాని కట్టి మిక్కిలి జాగరూకతతో దాఁచెదరు.

వట్టిగడ్డిని ఒకచోట మేటిగావేసి, సంవత్సరము పొడుగునను పశువులను మేపుచుందురు.

పైని జెప్పినట్లు వరినాటి పండించుటయే కాక, వెదచల్లి కూడ పండింతురు. విత్తులను పలుచేగాచల్లి, మొలచినమొక్కలను అక్కడనే పెరుఁగనిచ్చి, పండించిన పంటను వెదపంట అందురు. నీరు పెట్టుటకు వీలులేనంత మెరకగానున్న పొలమందును, నీటిముంపు విశేషముగా నున్న పొలమందును వెద చల్లుదురు. వెదచేనిలో ఒకచోట ఒత్తుగాను, మఱియొకచోట పలుచేగాను మొక్కలుండవచ్చును. కొన్ని విత్తనములు మొలవక పోవచ్చును. కనుక, వెదచేను, ఊడుపుచేనంత పంట పండదు.

ప్రశ్నలు:—1. పండినచే లెట్లుండును? 2. వరికుప్పలనెట్లు నూర్చెదరు? 3. విత్తనము లెట్లు దాఁచెదరు? 4. వెదచేనూడ్పు చేనివలెఁ బండునా? పండదా? ఎందుచేత?

మాటలు.—భారము, నమ్రతవహించుట, కాలయాపనము చేయుట, ఉల్లాసము, తీరుబడి, బంతి.

---

## 16. అది మాపనిగాదు.

ఒక యూరిలో ఒకభాగ్యవంతుఁడైన కాఁపుండెను. అతని కనేకులు నౌకరులుగలరు. అతఁడుచాల డబ్బుగలవాఁడు; గనుక, ఎక్కడకు వెళ్లినను సవారియెక్కి పోవుచుండెడివాఁడు. సవారి మోయుటకు నెలజీతములిచ్చి కొందఱుబోయీలను బెట్టుకొనెను.

ఆవు లతని కనేకములు గలవు. అందులో ఒకదాని దూడ మిక్కిలి యందమైనది. కాఁపునకు దానిపై ఎంతో మక్కువ. ఒక రోజున అది కనఁబడలేదు. అందుచేత. అతని కేమియు తోఁచకుండెను.

ఇతర సేవకు లెవ్వరో పనులమీఁద నుండుటచేత, దగ్గఱనున్న బోయీలను బిలిచి, మీరు చుట్టుపట్లనున్న గ్రామములకుఁ బోయి తప్పిపోయిన ఆవుదూడను వెదకి తీసికొనిరండని చెప్పెను.

వారిలో నొకఁడు పొగరుఁబోతు "అయ్యా! మీరు మాకు జీతములు సవారిమోయుట కిచ్చుచు, ఇపుడు దూడను వెదకి తీసికొని రమ్మనుచున్నారేమి? అది మాపనిగాదు" అని జేవాబిచ్చెను. తక్కిన బోయీలు వీపెడసరపుమాటలకు లోపల ఎంతో నొచ్చుకొని నప్పటికిని, ఏలాగుననో శ్రమ తప్పిపోవును గదా యని ఊరకుండిరి.

అంతట కాఁపు మాఱుమాటాడలేదు. కోపపడినట్లైనను గనఁబడ లేదు. చేటాలున లోపలికిఁబోయి, భోజనముచేసి,

దుస్తులు వేసికొని యాతడు "ఎవరక్కడ బోయీలు? త్వరగా సవారి దీయుఁడు" అని చెప్పెను.

తెచ్చిన సవారినెక్కి, లోపలఁ గొన్ని పదార్థములుంచుకొని "యెత్తుఁ" డని చెప్పెను.

బోయీలు సవారిదండెలు బుజేములమీఁద పెట్టుకొని "యెక్కడకు, బాబూ?" అని యడిగిరి;

"ఊరి చెంతనున్న చిట్టడవిలోనికి" అని అతిశాంతముగా ప్రత్యుత్తర మిచ్చెను.

కాలము వేసవి. జాముప్రొద్దైనను ఎక్కలేదు. బోయీలింకను గంజి త్రాగలేదు. ఎండలకడ రావచ్చునని సవారి మూలుగులు మూలుగుచు వడివడిగా పోవుచుండిరి.



మెల్లమెల్లరి. కోసులు నడచిరి. పైనినెత్తి నూఁడుచున్నది. అతి దాహమవుచున్నది. చిట్టడవిలో త్రాగుటకు నీళ్లెక్కడ? ఎంతదూరము పోయినను "ఆఁగుఁడు" అనఁడు. బోయీలకు

ముచ్చెమ్మటలు పోసెను. నాలుకలు పిడుచేలం గట్టుకొని పోయెను. కాళ్లు వడవడ వడఁకసాగెను.

అప్పుడు సవారిదింపి, వెనుకటిబోయియే యెదుటికి వచ్చి "మహాప్రభూ! మేమిఁక సవారిమోయలేము. చచ్చిపోవుటకు సిద్ధముగా నున్నాము. మీరు రేపనిమీఁద వచ్చితిరో, మేమెక్కడకుఁబోవలెనో సెలవిండు" అని యడిగెను.

"నేను దూడను వెదకవచ్చితిని. అది దొరకుదాఁక ఇంటికిఁ బోఁదలఁచుకొనలేదు. నావంతు దూడను వెదకుట; మీవంతు సవారిమోయుట, కాదా ?" యని కాఁపు జవాబు చెప్పెను.

ఇదంతయుఁ దమ పెంకెతనముయొక్క ఫలితమే యని తెలిసికొని, లెంపలు వాయించుకొని, "క్షమింపుఁడు, బుద్ధి వచ్చినది" అని బోయీలందఱును ఏడ్చిరి.

కాఁపు దయగలవాఁడు. ఇంతపఱకు వచ్చునని మొదటనే యెఱుఁగును. లోపలఁబెట్టిన అన్నమును, మజ్జిగను, బోయీల కిచ్చి. కొంచెము సేపుండి, సవారివెనుకకుఁ బట్టించి యింటికిఁ బోయెను.

దూడయెక్కడనుండియో తిరుగవచ్చి పసులశాలలోఁదూఱెను.

ప్రశ్నలు:—1. కాఁపు బోయీలతో మొదట నేమని చెప్పెను ? 2. వారిలో నొకఁడేమనిబదులుచెప్పెను ? 3. కాఁపు సవారిలోఁబెట్టుకొనిన వస్తువులేవి ? ఏల పెట్టుకొనెను ? 4. బోయీల పొగరుఁబోతుఁదనమున కేమిశిక్షయయ్యెను? 5. ఈపాఠమునకు 'అది మాపనిగాదు' అని యేల పేరువచ్చెను ?

మాటలు:—మక్కువ, వెడసరపు మాట, దండె, ప్రత్యుత్తరము, లెంపలు, పసులశాల.

---

# 17. జిల్లా.

పరిపాలన చేయుటకు వీలుగా, మన చెన్న రాష్ట్రమును మండలములుగా విభజించినారు. అట్టి మండలములను జిల్లాలందురు. ఒక్కొక్క జిల్లాలో పరిపాలన శాఖలు—డిపార్టుమెంట్లు—అనేకము ఉండును.

మన రాష్ట్రమునకు పై యధికారి గవర్నరు. గవర్నరనఁగా ఇంగ్లీషు భాషలో పరిపాలకుఁడని అర్థము.

జిల్లా పై యధికారిని 'కలెక్టరు' అందురు. కలెక్టరనఁగా వివిధములైన పన్నులను వసూలు చేయించు నతఁడు.

ఈయన రెవిన్యూవ్యవహారములు చూచువారిలోనే కాక, దోషులను దండించువారిలోను ఉన్నతాధికారి; కనుక అతనికి 'డిస్ట్రిక్టుమేజిస్ట్రేటు' అనికూడ పేరు.

ఇదియుఁగాక అడవుల పరిపాలనలో గవర్నరునకు ప్రతినిధిగానుండి వ్యవహరించును. అందుచేత అతనిని-గవర్నరు గారి ఏజెంటు - అందురు.

ప్రజలవలన చిల్లరపన్నులు కొన్ని పుచ్చుకొని వానిని వారి సౌఖ్యమునకై యే వినియోగ పఱుతురు. ఇట్లు సేమ చేయు మొత్తములను 'లోకల్ఫండ్సు' అందురు. వానితో రోడ్లు వేయింతురు. వంతెనలు కట్టింతురు. చిన్న చిన్న అయో మార్గములు (రెయిలోడ్లు) వేయింతురు. వైద్యశాలలు - (హాస్పిటలులు) పాఠశాలలును పెట్టింతురు. బాటసారులు బసదిగుటకు, విశ్రాంతి శాలలు—(రెస్టుహౌసులు) కట్టింతురు. ఇంకను ఎన్నోయుపయోగకరములైన పనులు చేయింతురు.

ప్రజల అభిప్రాయములు బుచ్చుకొని యీ లోకల్ఫండ్సును వ్యయపఱుతురు. అట్టి యభిప్రాయమునిచ్చు ప్రజాసంఘములు యూనియనులనియు, తాలూకా బోర్డులనియు, డిస్ట్రిక్టు బోర్డులనియు జెప్పఁబడును. అన్నిటికి పైది డిస్ట్రిక్టుబోర్డు. దాని యధ్యక్షుఁడు డిస్ట్రిక్టుబోర్డు ప్రెసిడెంటు.

జిల్లాలోని పెద్దపెద్ద పట్టణములలో ఇట్టి స్వతంత్రపరిపాలనము చేసికొను సంఘమును - మ్యునిసిపాలిటి- యందురు. దానిలో ముఖ్యుఁడు, చెయిర్మను. చెయిర్మను అనఁగా అగ్రాసనమునందుండువాఁడు.

డిస్ట్రిక్టుమునసిఫులపైని, మేజస్ట్రేట్లపైని, అప్పీళ్లుపట్టి విమర్శించుటకు జిల్లాజడ్జి యుండును. సివిల్ వ్యవహారములు పరిష్కరించునపుడు అతనిని 'డిస్ట్రిక్టుజడ్జి' యనియు క్రిమినల్ వ్యవహారములు పరిశీలించునపుడు 'సెషన్సుజడ్జి' యనియు అందురు. జడ్జి అనఁగా న్యాయాధికారి. జడ్జి హోదాకు కలెక్టరుహోదాకు తక్కువకాదు.

పత్రములు రెజిష్టరుచేయు సబురెజిస్ట్రార్లకు పైయధికారి, జిల్లా రెజిస్ట్రారు. అతనిని 'డిస్ట్రిక్టు రెజిస్ట్రారు' అందురు.

జిల్లాలోని అటవీపరిపాలనాధికారులలో పెద్దాయనను - 'డిస్ట్రిక్టు ఫారెస్టు ఆఫీసరు' అందురు. ఫారెస్టు అనఁగా అడవి, ఆఫీసరు అనఁగా ఉద్యోగి.

రోడ్లు, వంతెనలు మొదలగు లోకల్ఫండు పనులను జూచెడు పైయధికారి, లోకల్ఫండు ఎంజినియరు.

టపా కచ్చేరీలను బరీక్షించు అధికారి 'పోస్టలుసూపరింటెండెంటు'. సూపరింటెండెంటు అనఁగాఁ బరీక్షించు పైయధికారి,

అతని యధికార మొకప్పుడు జిల్లాను దాఁటియునుండవచ్చును.

జిల్లాలోని పోలీసు వారి పై యధికారి, డిస్ట్రిక్టు పోలీసు సూపరింటెంఢెంటు.

వైద్యశాలలను బరీక్షించుటకును, విషూచి మొదలగు అంటు, రోగములు పుట్టినప్పుడు తగిన యేర్పాటులుచేసి ప్రజారోగ్యమును కాపాడుటకును ఒక 'డిస్ట్రిక్టు మెడికల్ అండు సేనిటరీ ఆఫీసరు' ఉండును. మెడికలాఫిసరనఁగా వైద్యసంబంధోద్యోగి. సేనిటరీ ఆఫిసరనఁగా ఆరోగ్యరక్షకుఁడైన యుద్యోగి.

క్రిందిపాఠశాలలో విద్యబాగుగా చెప్పుచున్నారో లేదో అప్పుడప్పుడు పరీక్షించి చూచుటకు జిల్లాకొక పరీక్షకుఁడుండును. ఉన్నతపాఠశాలా పరీక్షకునకు (అనఁగా ఇన్స్పెక్టరునకు) సహాయుఁడుగా నుండును గనుక, ఆయనను 'అస్సిస్టెంటు ఇన్స్పెక్టరు' అందురు. ఇన్స్పెక్టరు అనఁగాఁ బరీక్షకుఁడు. అస్సిస్టెంటు అనఁగా సహాయుఁడు. ఈయనక్రిందఁ గూడను ఉపపరీక్షకు లుందురు.

పైని జెప్పిన, పెద్దకచ్చేరీలన్నియును సాధారణముగా జిల్లా ముఖ్యపట్టనములోనే యుండును.

ప్రశ్నలు :—1. జిల్లాలో ముఖ్యమైన పరిపాలన శాఖలను, వాని పై యధికారులను జెప్పుము ? 2. కలెక్టరేయేపనులు చేయును? 3. వైద్యశాలల పైని జిల్లాఅధికారి యెవరు? 4. ఎంజినియరేయేపనులు చేయును ? 5. లోకల్ఫండ్సనఁగా నేమి? 6. వాని నెట్లుపయోగింతురు ?

మాటలు.—వినియోగపఱచుట, అయోమార్గము, విశ్రాంతిశాల, అధ్యక్షుఁడు, స్వతంత్రపరిపాలనము, అగ్రాసనము, పరిష్కరించు, హోదా, అంటురోగములు, విషూచి, అప్పీలు ఉపపరీక్షకుఁడు.

# 18. రాజు, కాఁపువానికొడుకు.

ఒకరాజొక భయంకరమగు రోగముచే బాధపడుచుండెను. ఆరోగమిట్టిదని చెప్పుట మిక్కిలి అసహ్యముగనుండును గనుక చెప్పకుండుటయే మంచిది. ఏవోకొన్ని లక్షణములుకల మనుజుని చేఁదుకట్టు తెచ్చి దానితో చికిత్సచేసిన యెడల రోగము కుదురునని కొందఱు వైద్యులు చెప్పిరి. ఆలక్షణములు కల మనుజునిఁబట్టి తీసికొని రండని రాజు భటుల కాజ్ఞాపించెను.

ఒక కాఁపువాని కొడుకునకు ఆలక్షణములుండెను. వానిని భటులుపట్టుకొని రాజునొద్దకుఁ గొనిపోయిరి. ఆపిల్లవానికి తల్లి దండ్రులుండిరి. వారు తమ కొడుకుచావున కొప్పుకొందురా ? కాని, రాజు, వారికి విశేషధనమిచ్చి ఒప్పుకొనఁజేసెను !

ఇక్కడకు తల్లి దండ్రులొప్పుకొనిరి! ఇఁక ఒప్పుకొనవలసిన వాఁడుపట్టణములోని న్యాయాధికారి. ఆతని ఉత్తరువులేకుండ ఎవ్వనిని చంపఁదగదు. "రాజుగారి ప్రాణమును గాపాడుట కాతని జనులలో ఒకనిప్రాణమును దీయుట న్యాయమే" యని న్యాయాధికారి యుత్తరువుకూడ ఇచ్చెను.

ఈ అపశిష్టముకూడ తీఱినది. ఇఁక అభ్యంతరమే మున్నది తలారి, గండగొడ్డలిచేతఁబుచ్చుకొని పిల్లవాని తలనఱుకుటకు సిద్ధముగా నుండెను. ఆచిన్నవాఁడు ఆకాశముపై దృష్టిపఱపి ఏదియో మెల్లఁగా గొణఁగుకొనుచు తనులో తాను నవ్వుకొను చుండెను. రాజు అతనిఁజూచి "ఏమిగొణఁగుకొనుచుంటివి? ఇట్టి ఆపదలో నవ్వెదవేమి" అని యడిగెను.

"ఆపదలో బిడ్డలు తల్లిదండ్రుల అండఁజేరుదురు. తమకు జరిగిన అన్యాయములను తప్పింపుమని జనులు న్యాయాధిపతి

యొద్ద ఫిర్యాదు చేసికొంటిరి. నాతల్లిదండ్రులు నీచమైన ధనమును అపేక్షించి నన్నుఁ జంపుట కంగీకరించిరి. న్యాయాధిపతి నా చంపు మిగుల న్యాయమని ఉత్తరవు కూడఁ జేసెను. పోనీ! రాజుతో మనవి చేసికొందు నన్న నన్నుఁ జంపి ఆతఁడు బ్రదుకఁ దలఁచుకొనియుండెను. ఇట్టి స్థితిలో 'ఆహా! పరమాత్ముఁడా! నీకంటె దిక్కు మఱెవ్వరును లేదు కదా!' అని యనుకొనుచు ఏడువఁజాలక నవ్వుచుంటిని" అని యాతఁడు బదులు చెప్పెను.

రాజు ఈమాటలను విని కనుల నీరు పెట్టుకొని "ఇట్టి బుద్ధిమంతుఁడు చచ్చుటకంటె నేను జచ్చుటయే మంచిది. అతనిని వదలి పెట్టుఁడు" అని భటులకాజ్ఞాపించెను. ఆచ్చివానిని బుజ్జగించి ముద్దుపెట్టుకొని గొప్ప బహుమతులిచ్చి పంపివేసెను.

దైవకటాక్షమువలన ఒకవారము దినములలో రాజునకు ఆ వ్యాధి కుదిరెనఁట.

ప్రశ్నలు:— 1. రోగ మెట్లు కుదురునని రాజుతో వైద్యులు చెప్పిరి. 2. కొడుకు మృతికిఁ దల్లిదండ్రు లెట్లంగీకరించిరి? 3. న్యాయాధికారి యేమని యుత్తరువిచ్చెను? 4. బాలుఁడు గొణఁగుకొనుచుండఁగా, రాజేమని యడిగెను? 5. బాలుఁ డేమని చెప్పెను?

మాటలు;—లక్షణము, చికిత్స, రాజభటులు, న్యాయాధికారి, గండగొడ్డలి, దైవకటాక్షము.

---

## 19. తోఁడేలు.

కుక్కయును, నక్కయును, తోఁడేలును ఒక్కజాతి జంతువులు. సెంపుడు తోఁడేలు కుక్కవలె మొఱుఁగును.

తోఁడేళ్లు సాధారణముగా భూగోళమునందు ఉత్తరభాగమునందుండును. ఆఫ్రికాయందుఁగాని దక్షిణపు అమెరికాయందుఁ

గాని తోఁడేళ్లుగాన్పింపవు. మనదేశమునందు హిమవత్పర్వతమునకు దక్షిణభాగమునందుఁ గలవు. పశ్చిమసముద్ర తీరమునందు తోఁడేలు లేదఁట.

కొండగుహాలలోఁగాని, చెటుతొఱ్ఱలలోగాని, పడిపోయిన చెట్ల మొదట బొఱియలలోఁగాని. తోడేలు వాసస్థానము ఏర్పఱచుకొనును.



అది సుమారు మూఁడడుగులు పొడువుండును. ఒంటరిగాఁ గాని, జతలుగాఁ గాని రేయుంబగళ్లు సంచరించుచుండును. శీతకాలమున తోఁడేళ్లు గుంపులుగాఁ దిరుగుచుండును.

తోఁడేళ్లు పిఱికి జంతువులైనను ఆఁకటిచేత నకనకలాడునప్పుడును, గుంపులుగాఁగూడి గుఱ్ఱములు పశువులు మొదలగు పెద్దజంతువులను బట్టుకొని చంపునప్పుడును, మిక్కిలి తెగువ గలిగియుండును.

తోఁడేలు మిక్కిలి క్రూరజంతువు. గుంపులు గూడి వందల కొలఁది లేళ్లనుజంపి, కొన్నిటిని అక్కడక్కడతిని మిగిలిన వానిని ముట్టకయే పోవునఁట.

ఒక్క తోఁడేలుండినను, ఎన్నో ఉన్నంత కోలాహలము చేయును. ఒకనాఁడు ఒక మార్గస్థుఁడు సాయంకాలమున తోఁడేటి కూఁతవిని చెట్టెక్కి కూర్చుండెను. రాత్రియంతయును ఏఁబది తోడేళ్లుండినచో ఎంత అల్లరిచేయునో, యంత యల్లరి ఆయొక్క తోఁడేలు జేసినది. పాపము! బాటసారి రాత్రియంతయు నిద్ర లేక గడగడవణఁకుచు చెట్టుమీఁదనే యుండి ప్రాణము దక్కించుకొనెను. రాత్రి అల్లరిచేసిన తోఁడేలు రెండు మైళ్లు దూరమున నున్నదనియు, అదియొక్కటే యున్నదనియు, మఱు నాఁడు దెలిసికొన్నప్పుడు వానికి మిక్కిలి ఆశ్చర్యము గలిగెను. తోఁడేలు మిక్కిలి వడిగా పరుగెత్తి జంతువులను బట్టుకొనును. తోఁడేలు నక్కవలె టక్కరిజాతువు. వేఁటకాండ్రు వలలలోఁ బడక తప్పించుకొని పోవుచుండును. కర్మముచాలక పట్టుపడిన పక్షమున, చచ్చినట్లు పడియుండి సందుదొరకఁగానే పాఱి పోవును.

అది లేళ్లను, గొఱ్ఱెపిల్లలను మేఁకపిల్లలను జంపుకొనితినును. పల్లెలకువచ్చి అప్పుడప్పుడు మనుష్యశిశువులను ఎత్తికొనిపోయి తినును. ఆఁకటిచేత బాధపడుచున్నప్పుడు చిట్టెలుకలను, కప్ప లను, చెట్లమొలకలనుగూడ తినును. రెండు మూఁడు కలిసి కాని మనుష్యునిఁ జంపవు. రష్యాదేశమునందు బాటసారులు అనేకులు ఏఁటేఁట తోఁడేళ్లకు ఆహారమగు చుందురని చెప్పు కథ. లనేకములు గలవు.

ప్రశ్నలు:—1. తోఁడేలేజాతిలోనిజంతువు? 2. అదెక్కడనుండును? 3. అదెట్టిస్వభావము గలజంతువు? 4. అదేవి తినును.

మాటలు;— తెగువ, క్రూరజంతువు, కోలాహలము, బాటసారి, సందుదొరకఁగానే,



# 20. పావురములు, గువ్వలు.

## మొదటి భాగము.

పావురములకును గువ్వలకును భేదము అంతగా కనబడదు. రెండును ఒక జాతిలోనివే. గువ్వలు అడవి పావురములకు చాల చేరువగానుండును. కాని పావురములకంటె చిన్నవి. ఎఱకలు ఎక్కువ మృదువుగానుండును. డేగలకు సాధారణముగా దొరకనంత వేగముగా ఎగురును. వర్ణము ధూసరవర్ణము. ధూసరవర్ణమనఁగా బూడిదరంగు పావురములను పెంచినట్లు గువ్వలను తఱచుగా పెంచేరు.

పావురము అందమైన పక్షులలో నొకటి. మొండెము స్థూలము గాను ండును. మెడపొగగా, సుందరముగా నుండును. తల చిన్నది గాను, గుండ్రముగాను ఉండును. ముందఱ దృఢమైన చంచువు ఒకటి యుండును. చంచువనఁగాముక్కు. మనకు నోరెట్లు పయోగించునో దానికి చంచు వట్లుపయోగించును.

పావురమునకు గుండ్రని, చక్కని, కన్నులు గలవు. మనకు రెండు కనుఱెప్పలుగాని దానికి మూఁడున్నవి. మూఁడవఱెప్ప పలుచని పొరవలెనుండును. దానితోఁ బావురముతటుక్కునఁ దనకంటి గ్రుడ్లును కప్పుకొనుచు తెఱచుకొనుచుఁ ఉండును. పిట్టల కన్నులకు దృష్టిబల మెక్కువ. చెవులు, మనకువలెఁగాక, చిన్న రంధ్రములుగా నుండును.

పక్షిగనుక పావురమునకు రెండుకాళ్ళు యుండును. ఒక్కొక కాలికి వాఁడిగోళ్ళుగల నాలుగేసి వ్రేళ్లుండును. వానిలో ఒకటి వెనుకకుండును, మూఁడు ముందునకుండును. పావురము చెట్ల మీఁదవ్రాలి వానితో కొమ్మను గట్టిగాఁబట్టుకొని నిశ్చింతగా నిద్రకూడఁ బోఁగలదు. అది కాళ్లతోదుముకుచు నేలమీఁదఁ బోవక, మనము నడచునట్లు నడచును. భారముగల మొండె మును మోయవలెను గనుకఁ, గాళ్లు మిక్కిలి బలముగలవిగా నుండును.

ఎగురుట కుపయోగించు ఱెక్కలు పొడుగుగాను బలిష్ఠము గాను ఉండును. మెడమీఁదను, చీలమండలవఱకుఁ గాళ్ల మీఁదను, పట్టువలెమెత్తగానుండు చిన్న యీఁకలుండును. పక్షి యీఁకలు శరీరములోని వేఁడిమిని గాపాడి, చేలి దగులనీయ

కుండును. పీనిమీఁద నీళ్లు తామరాకు మీఁది నీళ్ల వలె జాఱిపోవును.

పావురములు నానావర్ణములుగా నుండును. కాని తఱచు మనము చూచు పావురములు తెల్లగాఁగాని, ఆకాశనీలవర్ణముగాఁగాని యుండును. పెక్కు పావురములకు గొంతుచుట్టును చెక్కని కంఠమాల లుండును. వెలుగులో అవి నెమిలి కంఠమువలె నిగ నిగ లాడుచుండును.

కుత్తుకకులుకులతో నడచుచు పావురములు హుక్కా పీల్చినట్లు గుడుగుడుమని రుతము చేయును.

మనకొక్కటే అన్నకోశముగాని, పావురమునకు మూఁడున్నవి. మొదటిది గొంతుకదగ్గఱ నున్నది. ఇక్కడ, మ్రింగిన గింజలు మొదలగునవి నాని చివుకును. అక్కడనుండి మన కడుపువలెనున్న రెండవకోశములోనికి ఆహారము పోవును. అక్కడనుండి దళమైన ఆవరణముకలిగి దృఢముగా నుండు మూఁడవకోశములోనికిఁ బోవును. ఇక్కడ పావురము మ్రింగెడు గులకరాలరాపిడిచేత ఆహారమంతయు బాగుగా నలఁగి జీర్ణమగును.

ప్రశ్నలు:—1. పావురమెందుచేత సొగసైనపక్షి? 2. గువ్వయేదో పావురమేదో కనుఁగొనుటకు రెండు మూఁడు మార్గములను జెప్పుము? 3. పావురమున కెన్ని కనుఱెప్పలున్నవి? 4. ఆహారకోశము లెన్ని? 5. సాధారణముగాఁ బావురము లేయే రంగులు గలవిగానుండును?

మాటలు,—మొండెము, స్థూలము, సోగ, ఎఱుకలు, దృష్టి బలము, నిశ్చింత, కంఠమాల, బలిష్ఠము, కుత్తుకకులుకులు, చివుకు, ఆవరణము.

# 21. పావురములు, గువ్వలు.

## రెండవ భాగము.

పాములు కుబుసము విడిచినట్లు, పక్షులు సాలున కొకటి రెండు సారులు పాతయీకలను రాల్చుకొనును. వాని వెంబడిని క్రొత్తవి బయలు దేఱును.



ఱెక్కలు చాఁచి పక్షులు గాలిలో ఎగురునప్పుడు పైని గోడిగాను. అడుగున పల్లముగాను, తెఱచిన గుడ్డగొడుగులవలెనుండును, కనుక క్రిందఁబడక, గాలిలో తేలియుండుట వానికి సుకరము. ఱొమ్ముకండలబలముతో పడవ తెడ్లవలె ఱెక్కలను ఆడించుచు పక్షు లెగురును. తోఁక చుక్కానువలె, ఏ వైపునకు పోవలెనన్న, ఆ వైపునకు శరీరము త్రిప్పుటకు ఉపయోగపడును.

కొన్ని పెంపుడు పావురములను పైకి ఎగురవేసినప్పుడుగాలిలో పల్లటీలు గొట్టును. కొన్ని నేలమీఁదవదలినప్పుడు. అదేపనిగా దొమ్మరవానివలె మొగ్గలువేయును.

నేలబొఱియలలోఁగాని, చెట్లమీఁదఁగాని, కొండపగుళ్లలోఁ
గాని, పావురములు గూండ్లు కట్టుకొనును. ప్రాచీన దేవాలయముల
మీఁద అనేక పారావతములు నివసించియుండుట మనము
చూచుచునే యున్నాము.

పెద్ద భవనములలో సంపన్నులు పెంపుడు పావురములకు
స్తంభముల మీఁద గూండ్లు కట్టింతురు. పావురములకు పరమ
శత్రువులైన పిల్లి మొదలగు జంతువుల బాధ రాకుండ వానిని
కాపాడెదరు. ముఱికి, చెమ్మ, ఈఁదర ఇవి పావురములకు హాని
గలుగఁజేయును. కనుక వాని కవి తగులనీయరు.

గింజెలు, కాయలు, పండ్లు పావురములకు ఆహారములు.
కొన్ని పావురములు జాజికాయలు ఆవశ్యముగానే భక్షించునఁట.

సాధారణముగా, ఆఁడుపావురము రెండు తెల్లగ్రుడ్లు పెట్టును.
వంతులు వేసికొని, ఆఁడు పావురమును మగపావురమును కూడ
గ్రుడ్లను పొదగి, పిల్లలను జేయును. కొన్నాళ్ల వఱకు వాని
మొదటి యాహారకోశములో ఊరు, పాలవంటి ద్రవపదార్థ
ముతో తల్లిపిట్టయుఁ దండ్రిపిట్టయు పిల్లలను మేపును

తక్కిన పక్షులకంటె పావురములకు - అంతకంటెను గువ్వ
లకు-దాంపత్యానురాగ మెక్కువ. ఒక గువ్వ నెవరైన, దయమాలి
చంపిన, విజోడైన గువ్వ మఱల జోడుగట్టదఁట. పావురములు,
గువ్వలును అతిసాధువులైన పక్షులు.

పావురములచే దూరదేశములకు వార్తలంపువాడుక చిర
కాలమునుండి కలదు. బాగుగా నేర్పినయెడల పావురములు
దూతకృత్యములు చక్కఁగా నెఱవేర్పఁగలవు.

సంకేతాక్షరములతో జాబు పలుచని కాగితము మీఁద
వ్రాసి, చిన్న చుట్టగాఁ జుట్టి, తడియకుండ దానిని చిన్న బొతుకలపు

గొట్టములో పెట్టి దాని లక్కపూసిన సన్న పట్టుదారముతో బలమైన యొకతో(కయెఱక మొనకట్టిపెట్టి పంపుదురు.

దరిదాపుగా గంటకు ముప్పదియేను మైళ్లు చొప్పున పావురము. నాలుగువందల మైళ్లకుమైగా ప్రయాణము చేయుఁగలదు. కాని, ఒకొక్కప్పుడు దారితప్పిపోవును. ఒకొక్కప్పుడు, పాపము శత్రుపక్షులకు డేగలకు ఎరయై చచ్చిపోవును.

ప్రశ్నలు:—1. పక్షు లెగురుటకేయేసాధనములుగలవు? 2. పావురమెన్ని గ్రుడ్లు పెట్టును? 3. గ్రుడ్లుపొదుగుట, పిల్లలనుమేపుట యెట్లు జరుగును? 4. పావురమేమి తిని బ్రతుకును? 5. పావురముచేత వార్తలెట్లుపంపుదురు?

మాటలు.—గోడి. (?) చీనము, పారావతము, భవనము, సంపన్నులు, ఈఁదర, పాళము, అతిసాధువులు, ద్రవపదార్థము విజ్ఞోడు, దూతకృత్యములు, సంకేతాక్షరములు, దాంపత్యానురాగము; శత్రుపక్షులు.

---

# 22. మితభోజనాదికము.

ఆరోగ్యమును బలమును గాపాడుకొనుటకు ఎల్లరునువారి వారి శరీరస్థితుల ననుసరించి కొంత ఆహారము భుజింపక తప్పదు. అట్లు తీసికొను ఆహారము మితముగా ఉండవలెను, బాగుగా నీటితో ఉడికినదై యుండవలయును. తేలికగా అరుగునదై యుండవలయును. బలమునిచ్చునదై యుండవలయును, గాని, నేతితో మిక్కిలిగా ఉడికి వేఁగినదై యుండఁగూడదు. చిత్రచిత్రములగు మసాలాలతో కూడినదగా ఉండఁగూడదు.

కొందఱు మితిమీఱి తిందురు. అట్టివారిని తిండిపోతు లందురు. వారిదృష్టి యెల్లప్పుడు ఆహారము మీఁదనేయుండును. వారి బ్రదుకెల్ల భోజనమునకే అయినట్లగపడును. బ్రతుకుట

కొఱకు భుజియింపవలయును గాని, భుజియించుటకె బ్రదుకఁ గూడదు.

తిండిపోతునకు నిద్ర యెక్కువగా నుండును. విశేషముగా నిద్రించునాతనిబుద్ధి వికాసవంతముగా నుండదు. తిండిపోతులు తఱచుగా బుద్ధి చాకచక్యముకలవారై యుండరు. అట్టివారు తఱచుగా ఆరోగ్యవంతులుగాఁ గూడ నుండరు. ఆరోగ్యమునకు కొంత మితమగు ఆహారమే యావశ్యకము. ఆమితి దాఁటినవానికి అనారోగ్యము కాక ఆరోగ్యమెచ్చటిది ?

తిండిపోతు నైజములు తెలిసెగా చూతుమనఁగ త్రాగుఁబోఁతు మాట వేఱే చెప్పవలయునా ? త్రాగినవాఁడు పెద్దపిన్నలభేద మెఱుఁగఁడు. మంచిచెడ్డల తారతమ్య మెఱుఁగఁడు. సన్నిపాత రోగివలె నోటికివచ్చినట్లు వదరును. పిచ్చివానికిని ఆతనికిని భేద మేమియు లేదు త్రాగుఁబోఁతుఁడనఁగ కొనితెచ్చికొన్న పిచ్చి. త్రాగియున్నవాఁ డెంతమాటయైనను అనుటయేకాక యెట్టి పనినైనను జేయును. 'ఇది చేయఁదగును. ఇది చేయఁదగదు,' అనుబుద్ధి నశించినవాఁ డేమి చేయకుండును ? త్రాగుఁబోఁతు నరహత్యకూడఁ జేయు ననుటకు సందేహము లేదు.

త్రాగుఁబోఁతునకు మాట నిలుకడ లేక పోవుటచేత ఆతనిని ఎవ్వఁడును నమ్మఁడు. ఆతఁ డేపనియును తిన్నగాఁ జేయలేఁడు, చేయఁడు. అందుచే ఆతనికి దినముగడచుటయే దుర్లభముగా నుండును. ఇంటిలోని భార్యయును పిల్లలునుతిండిలేక మలమల మాఁడుచుందురు. ఆతఁడింటిలోని చెంబో కంబళియో తీసికొని పోయి తాకట్టుపెట్టి త్రాగివచ్చును. ఒడలు తెలియక ఇల్లాలిని బిడ్డలను గొట్టును. భార్య యీబాధసహింపలేక ఆత్మహత్య

చేసికొనవచ్చును. పిల్లలు దిక్కుమాలినపక్షులై పోవుదురు. త్రాగుబోతు కొంప అన్ని కష్టములకును తావై యుండును.

భోజనములో మితితగును గాని, మద్యపానము మొదలే తగదు. బ్రాంది మొదలగు మదద్రవ్యములను మితముగా తీసికొనిన బాధయుండదని యెంచరాదు. ఇప్పుడు గచ్చకాయ యంత నల్లమందు వేయువారందఱును మొదట చోడిగింజంత మందుతో ఆరంభించినవారె. ఇప్పుడుదినమునకు పదలముకోటాకు పొగబీలుచు వారందఱు మొదట గోగుపుల్లలుగాల్చిన వారే. ఇప్పు పీపాలకొలఁది వంపువెట్టువారందఱు మొదట ఔషధ ప్రాయముగా అఱయౌన్సు పుచ్చుకొనినవారే. మదద్రవ్యములను దీసికొనుటలో మాత్రము మితి యెన్నఁడు నిలువదు. ఈదినమునకు సరిపోయిన మత్తును మదమును ఇచ్చుపరిమాణము రేపటికిసరిపోదు. మఱికొంత హెచ్చించినఁగాని అది రేపటికితగిన మత్తునీయదు.

చెఱువులు నదులు ఇచ్చు నిర్మలమగు నీరుండ, గోవులిచ్చు తీయనిపాలుండ, ధనమును గౌరవమును ఆరోగ్యమును ఆయువును హరించు సారాయిపుచ్చుకొనుట మంచిదికాదు. భోజనమందు వలెనే నిద్రయందు కూడ మితి యుంచవలయును.

**ప్రశ్నలు:—1. ఎట్టి యాహారమును మనము భుజింపవలయును? 2. ఎట్టి యాహారమును దఱచుగా భుజియింపఁగూడదు? 3. త్రాగుటలో మితి యేల నిలువదు?**

మాటలు.—వికాసవంతము, చాకచక్యము, ఆవశ్యకము, తారతమ్యము, నరహత్య, దుర్లభము, తాకట్టు, ఇల్లాలు, ఆత్మహత్య, తావు, మదద్రవ్యము.

# 23. సింహము.

సింహము మాంసాహారి. దానికి వాఁడియగు కోఱలుండును. వక్రమగు గోళ్లుండును. అది చేప్పుడు కాకుండనడచును. కనుక సింహము, పులి, పిల్లియు ఒక్క జాతిలోనివి. ఇవి అప్పు డప్పుడు గోళ్లతో చెట్ల బరడుమీఁద బరికి వానిని శుభ్రము గాను వాఁడిగాను ఉంచుకొనును.

ఈజాతి జంతువులకు పొడవైన మీసము లుండును. రాత్రి యందు చీఁకటిలో దానితో స్పృశించి దారిని దెలిసికొనఁగలవు.

ఎముకలను అంటియున్న మాంసమును గీఁకుకొని తినుటకు వీలుగా, వానికి నాలుక ఆకురాతివలె కఱకుగా నుండును. కుక్క నాలుక అట్లుండదు.



పిల్లిజాతిమృగముల శరీరము మీఁద బొచ్చు పొట్టిగానుండును కాని, మగసింహము మెడమీఁదను, భుజముల మీఁదను పొడువైన జూలు లుండును. దీనికి కేసరము లని పేరు. కేసరములు గలది కేసరి. కేసరియనఁగా సింహము. కేసరములు

సింహమున కెంతో అందము తెచ్చును.

ఈజాతిమృగములకు నీరన్న భయ మను వాడుక గలదు. కాని. పులి యీదుచుండఁగా చూచినవారు గలరు.

సింహము రాజపుత్ర స్థానమందును, పారసీకమునందును, అప్రికాయందును ఉండును.

అది తోఁకతో తొమ్మిదియడుగు లుండును. తోఁక మూఁడడుగు లుండును.

అది తఱచు ఒంటరిగానుండును. అప్పుడప్పుడు జేతలుగాను ఐదారేసి గుంపులుగాను ఉండుటకూడఁ గలదు.

దానిమీఁద చారలుగాని. చుక్కలుగాని ఉండదు. శరీరము మాసిన పసుపురంగుగా నుండును.

గంభీరాకారమును బట్టియు, భీకరత్వమును బట్టియు సింహము మృగరాజందురు.

పగలు నదుల గట్లనున్న తుప్పలలోనో, పొదలలోనో, పండుకొని రాత్రులు సంచరించును. చీకటి రాత్రులలో మిగుల విచ్చలవిడిగా తిరుగును. వెన్నెల రాత్రులందు మిక్కిలి జాగరూకతతో నుండును.

సింహము చెట్లెక్కలేదు.

పులికంటె సింహమునకు ధైర్య మధికము.

నోటిని నేలపై మోపి చుట్టుపట్లభూమి అదరునట్లు సింహము బిగ్గరగా బొబ్బరించును. అడవిలోని జంతువులన్నియు చేష్టలు దక్కి, ఎక్కడ నున్నవి అక్కడనే నిలిచి యుండునందురు.

ఆఁడుసింహము ఈఁతకు రెండు మూఁడు కూనలనుబెట్టును. పుట్టినప్పుడు సింహపుపిల్లలు కన్నులు తెఱచుకొని యుండునఁట.

పెద్దజంతువును బట్టుకొనవలసి వచ్చినప్పుడు రెండు మూఁడు కలిసి పట్టుకొనును.

సింహము ఏనుఁగు కుంభస్థలమును బ్రద్దలుకొట్టి మెదడును దినునని తెలియుటకు కవులు వ్రాయుదురు. కాని యది లేళ్లను, అడవి పందులను, పశువులను, ఖడ్గమృగములను లొట్టిపిట్టలను దినుట యథార్థము. మిగుల ఆఁకలిగానున్నప్పుడుగాని, కోపము రేఁగినప్పుడు గాని తప్ప సింహము మనుష్యుని జోలికిపోదు.

ప్రశ్నలు:—1. ఎందువలన సింహము పిల్లిజాతిలోనిదందురు? 2. పిల్లి జాతి జంతువుల నాలుక యెట్లుండును? 3. సింహ మెక్కడనుండును? 4. దానికి మృగరాజని పేరెట్లు వచ్చినది? 5. అది యేమితినును?

మాటలు:—మాంసాహారి, బరడు స్పృశించుట, గీఁకుకొనుట, ఆకురాయి, గంభీరాకారము, భీకరత్వము, విచ్చలవిడిగా, జాగరూకత, ధైర్యము, బిగ్గరగా, కూన, కుంభస్థలము.

# 24. హిందూదేశము, అందలి ప్రజలు.

## మొదటి భాగము.

మన ముండు దేశము హిందూదేశము. హైందవులు విశేషముగా నుండుటచే అట్టిపేరువచ్చెను. భరతుఁడనుఒకగొప్పరాజు దీనిని పూర్వము పాలించుటచే భరతఖండ మను పేరు కూడ కలదు.

దేశమన్న మాటేకాని, దీనికి మహాఖండ లక్షణములు పెక్కులు గలవు.

మిక్కిలిసారవంతమగు వంగభూమి (బంగాళము) మొదలుకొనికచ్చి దేశపు చౌటిపట్టులవఱకు నానావిధములైన భూములు ఇందున్నవి.

మనచక్రవర్తిగారిసామ్రాజ్యములోనిదిప్రశస్తమైన దేశము. కనుకనే యిది వారికిరీటములోదివ్యమైన మణియని చెప్పుదురు.

ఈ పాఠముయొక్క రెండవభాగములో మన దేశమందలి ముఖ్య ప్రజలలో కొందఱింగూర్చి సంగ్రహముగాఁ జెప్పెదము. చెన్నరాష్ట్రములోనివారిఁ గూర్చి యిదివఱకే వ్రాసితిమి; కనుక ఇందులో అంతగాఁ జెప్పము.

ప్రశ్నలు:—1. మన దేశమునకు హిందూదేశ మనియు, భరతఖండ మనియుఁ బేరు లెట్లువచ్చినవి? 2. మనదేశమును ఖండమనిచెప్పుటకుఁ దగిన కారణములలో నాలుగుచెప్పుము? 3. మనదేశములోని పెద్ద నదుల రెంటిని జెప్పుము? 4. ఈ దేశములో మాటలాడు భాషలు సుమా రెన్నియున్నవి?

మాటలు.—సారవంతము, ఇవక, ఎడారి, ఉన్నతము, మహాఖండ లక్షణములు, నాటకరంగములు, నేత్రపర్వము, అనుకూలము, సమశీతోష్ణ ప్రదేశములు, వైశాల్యము, చౌటిపట్టులు, సామ్రాజ్యము.

---

## 25. హిందూ దేశము, అందలి ప్రజలు.

### రెండవభాగము.

### కాశ్మీర దేశము.

కాశ్మీరదేశము వాయవ్యదిశ నున్నది. అనఁగా ఉత్తరము పడమటికి మధ్యమందున్నది. అనేకవిధములైన పుష్పములతో సొగసుగా నుండును. ప్రజలు పొడుగుగాను అందముగాను ఉందురు. ఎప్పుడు ఉల్లాసముగానుండి. నవ్వుపుట్టునట్లు మాటలాడుదురు. శరీరచ్ఛాయ చక్కనిది. భాష కాశ్మీరి. అది సంస్కృతమునకు చేరువుగా



నుండును. పూర్వము బౌద్ధమత మెక్కువగా నుండెను, కాని యిప్పుడు పెక్కురు మహమ్మదీయులైనారు. వృత్తులనుబట్టికులము లనేకములుగలవు. ఇక్కడసాలువులు విశేషముగా నేయుదురు.

## రాజపుత్రస్థానము.

ఇది ఉత్తర హిందూస్థానములో పశ్చిమ భాగమున నున్నది. ప్రజలు రాజపుత్రులు, వీరు చంద్ర సూర్యవంశపు



రాజుల సంతతివారట. చక్కని పొడుగైన వారును, బలిష్ఠులును, శూరులును అని పేరు పొందినవారు. రాజభక్తియు, మర్యాదయు, స్త్రీగౌరవమును గలవారు. స్త్రీలు. సుందరు లును, తెలివి తేటలు గలవారును, శౌర్య వతులును అని ప్రసిద్ధిగాంచినవారు. భాషహింది; ఇది సంస్కృతముతో సంబంధించినది. మతముహిందూమతము, కానిజైనులు కూడ పెక్కురు గలరు. రాజపుత్రులు ఎఱ్ఱపాగాలుగాని, నీలి పాగాలుగాని చుట్టుకొని, నగలు విశేషముగా పెట్టుకొందురు.

## పంజాబుదేశము.

ఇది కాశ్మీరమునకు దక్షిణమునను, రాజపుత్రస్థానమునకు ఉత్తరమునను ఉన్నది. ఐదు నదు లిందులో ప్రవహించు



చున్నవి. కనుక ఇట్టిపేరు వచ్చినది. దీనిలో ఎందఱో మహమ్మదీయు లున్నారు, కాని జైనులును సిక్కులునుగూడ నున్నారు. సిక్కులు హిందువులు, వీరికిని తురకలకును పడదు. వీరు తలవెండ్రుకలను గడ్డములను పెంచుకొని నీలిదుస్తులను ధరింతురు. మిక్కిలి రణశూరులు.

మంచిజవానులు. ఖడ్గమును పూజింతురు. మతము సిక్కు మతము. భాష ప్రాకృతమునకు సంబంధించిన పంజాబి.

## నేపాళము.

ఇది ఉత్తరమున హిమాలయ పర్వతములో నున్నది. ఇందలి ప్రదేశములుకొన్ని అతి శీతలములు. బౌద్ధమతము



వారనేకు లున్నారు; కాని రాజవంశము వారందఱు 'ఘూర్కాలను హిందువులు. రాజపుత్రులవలెనే వారు మిక్కిలి బలశాలులు, ధైర్యవంతులు, యోధులు, ఎట్టిపర్వతములనైనను ఇట్టె సునాయాసముగా ఎక్కఁ గలరు. భాష పార్వతీయము. వీరుగాక, ఆటవికులు పెక్కురు గలరు.

## మహారాష్ట్రము.

దీనికి కొంకణ మని కూడపేరు. ఇది పశ్చిమ భాగమున, బొంబాయి రాష్ట్రములో నున్నది. ముఖ్యప్రజలు మహా



రాష్ట్రులు. వీరు హిందువులు, బలశాలులు; వీరులు; కొంచెము చామనచాయగా నుం దురు. అంత పొడుగైనవారునుగారు, పొట్టి వారునుగారు. మంచి బుద్ధిమంతులు. వీరికి కాపట్యములేదు. కాని యెవరైన అవమా నించినయెడల, వీరికోపము ఇంతటనంతటఁ బోవునదికాదు.

స్త్రీలు మిక్కిలి శుచిత్వముగలవారు. ఇండ్లు పరిశుభ్ర ముగా నుంచి, నిత్యముస్నానము చేసి, దేవపూజా నమస్కార ములు చేసికొందురు.

భాష మహారాష్ట్రభాష. వీరుగాక యీరాష్ట్రములో జైన మతస్థులును, భిల్లులు మొదలగు ఆటవికులును గూడఁగలరు.

బొంబాయి రాష్ట్రములో 'పార్సీ' లను మఱియొక తెగ వారు గలరు. మొట్టమొదట మహమ్మదీయులబాధ పడలేక, పారసీకదేశము నుండి యిక్కడకు వచ్చినారు. అగ్నిపూజకులు. చంద్రుని, నక్షత్రములను, జలమును గూడ పూజింతురు. వీరు మహాధనవంతులును, పరోపకారులునై యున్నారు.



## ఘూర్జర దేశము.

ఇదియు బొంబాయిరాష్ట్రము లోనిదే. ఉత్తరముగాను, కొంచెము పశ్చిమముగాను ఉన్నది. దీనికే సౌరాష్ట్రమని కూడపేరు. ప్రజలు గుజరాతులు. భాష గుజరాతిభాష. అది మహారాష్ట్ర భాషకుదగ్గఱగా నుండును. జనులు చక్కనివారు. తెలివి గలవారు. శక్తిపూజకులును, విష్ణుభక్తులును చాలఁగలరు. శ్రీకృష్ణ నివాసస్థానమైనద్వారక యిందులోనే యున్నది.



## వంగ దేశము.

ఇది మన దేశమునకు ఈశానదశనున్నది. ఈ దేశపువారు రాజపుత్రులంత ఉన్నతకాయులునుగారు, బలవంతులునుగారు, ధైర్యవంతులునుగారు. శరీరములోపొట్టివారేకాని, బుద్ధిలో మిరెపగింజవంటివారు. విద్యాప్రవీణులు,



మంచినాగరకులు. దుర్గాపూజ విశేషముగా చేయుదురు. భాష బంగాళి. హిందూస్థానికూడ కొందఱు మాటలాడుదురు.

## మైసూరు.

ఇది చెన్న రాష్ట్రములో దక్షిణభాగమునను న్నది. దీనినిఒక మహారాజేపరిపాలించుచున్నాడు. ప్రజలు తూర్పుతీరమువారి



కంటె దృఢగాత్రులు, పొడుగైనవారు, చక్కనివారు. విశేషముగామాటలాడుభాష కన్నడము—నాగరకత — ముఖ్యముగా స్త్రీవిద్య ... అభివృద్ధినొందుచున్నది. శృంగగిరి మతపీఠము ఈదేశముననే యున్నది.

## మహమ్మదీయులు.

వీరు దేశమంతటను వ్యాపించియున్నారు. పూర్వము రాజ్యము చేసిన జాతిలోనివారు. వేషభాషలలో హిందువులకు వేఱు



గా నున్నారు. హిందూస్థాని మాటలాడుదురు. మతము మహమ్మదీయమతము. వీరిలో విద్యావ్యాప్తి అంతగాలేదు. ఈజాతివారు శూరులు, మతాభిమానముఎక్కువగలవారు.

## ఆటవికులు.

అటవియనఁగా అడవి. అడవులలో నుండువారు. కనుక వీరికి అట్టిపేరు వచ్చినది. మనదేశములో దాదాపుగా ఆటవికు లన్ని వైపులనుఉన్నారు; వారిలో అనేక జాతులున్నవి.మనదేశమునకు వీరే ఆదిమ నివాసులని చెప్పుదురు. ఉండుఉనికిలో, వేసికొను బట్టలలో, తినుతిండిలో మిక్కిలి అనాగరకులు. విద్యలేనివారు. వీరందఱిలోను 'తోడాలు' అనువారు నాగరకతగలవారు.

వీరు నీలగిరులలో నుందురు. శరీరము పొడుగై చక్కనిరంగుగ



లదిగానుండును. వెంట్రుకలు ఉంగరములు చుట్టుకొని యుండును గడ్డములుమీసములు ఱొమ్ముమీదివెంట్రుకలుదట్టముగానుండును చివర ఉంగములు తిరిగి పోగవెంట్రుకలతో, తళతళలాడు కన్నులతో, ముత్యాలచాలువంటి పలువరుసతో, ఎఱ్ఱగా కాఁగిన పాలవంటి శరీరచ్ఛాయతో, కన్యలు మఱియు చక్కఁగా నుందురఁట.

'తోడా' లు, గేదెలను కాచుకొని జీవింతురు. గుడిసెలలోనుందురు. పాలు, పెరుఁగు, నేయి మొదలగునవి ఉంచుటకు వానిలో ఒక విశాలభాగ ముండును.

తమ కుటుంబమును, పశువులను, పాఁడిని వృద్ధిచేయుమని ఒక పేరుపెట్టి భగవంతుని కొలుతురు. ఉదయసూర్యుని చంద్రునికూడ పూజింతురు.

కన్యలు వివాహ మాడకుండుట వారిలో తప్పు. కనుక ఈడు తప్పినకూఁతునకు తండ్రివరశుల్కమిచ్చి, వివాహము చేయును. వారిలో మాఱుమను వున్నది.

**ప్రశ్నలు:—1. కాశ్మీరదేశస్థు లెటులుగా నుందురు? 2. రాజపుత్రస్త్రీలెందులోఁ బ్రసిద్ధి కెక్కినారు? 3. పంజాబు దేశస్థుల మతమేది? ఏభాషమాటలాడుదురు? 4. మహారాష్ట్రస్త్రీలెట్టివారు? 5. వంగదేశస్థులగుణసంపద యెట్టిది? 6. 'తోడా' కన్యలెట్లుందురు?**

మాటలు.—ఉల్లాసము, బలిష్ఠుఁడు, స్త్రీగౌరవము, రణశూరులు, జవాను, యోధులు, చామనచాయ, కాపట్యము, పరిశుభ్రము, నివాసస్థానము, ప్రవీణులు, దృఢగాత్రులు, మతాభిమానము, అవమానించుట, ఆదిమ నివాసులు, ఉనికి, శరీరచ్ఛాయ, వరశుల్కము, మాఱుమనువు.

---



## 26. దశరథునికి శాపము.

దశరథుఁడు చిన్నతనమున ఒకప్పుడు వేఁటకు పోయెను. వేఁటకు పోవువారు సాధారణముగా నీటిపట్టునకు సమీపమున మాటులో దాఁగియుందురు. అటులే రాజుకూడ సరయూనది రేవునకు కొంత చేరువనున్న మాటులో దాఁగియుండెను.

రాత్రి రెండు జాములు దాఁటినవి. నీటిలో బుడబుడ మను ధ్వనియైనది. అడవియేనుఁగు వచ్చి నీరు త్రాగుచున్నదని దశరథుఁడు తలఁచి ఆధ్వని వచ్చిన చాయను సూటిగ బాణమును విడిచెను.

నారాయణా!' యను ఆర్తరవ మంతట రాజేనకు వినఁబడెను. "హరిహరీ ! ఎంత పాపము! వనమృగమనియెంచి మను జేని చంపితిని కాఁబోలును" అనిదశరథుఁడు మిగుల ఆందోళన పడుచు నది యొద్దకు పరుగెత్తును. తేజస్సంపన్నుఁడగు ముని బాలుఁడు గట్టుపైని ఒఱగి "హాతల్లీ! హాతండ్రీ!!,, యనియేడ్చు చుండెను. నీటితో కొంచెము నిండిన సొఱకాయబుఱ్ఱ యెదుట నున్నది,

రాజేతని సమీపించి చేతులు జోడించుకొని "అడవి యేనుఁగని భ్రమించి యిట్టి మహాపరాధ మొనర్చితిని. నా దోషము అజ్ఞానకృతము కావున క్షమింప ప్రార్థించుచు న్నాను" అని దీనుఁడై పలికెను.

"నీవు నాబాధకై విచారింపవలదు. నీదోషమునకై విచా రింపవలదు. నాతలిదండ్రు లిటకుకొంత దూరమున నున్నారు. వారు మిగుల దాహపీడితులై యున్నారు. వారికి మంచినీళ్లు గొనిపోవుటకై నేనిచ్చటికి వచ్చితిని. వారంధులు. వారికి నేనొక్కఁడనే పుత్రుఁడను దప్పిచే వా రెంత బాధ నొందు చున్నారో ! నీవుపోయి యీతీర్థమును వారికిమ్ము. వారికి పరి చర్యచేయు భాగ్యము నాకిఁక లేదు" అని మునికుమారుఁడు పలికెను.

"ఇంత ఘోరకృత్య మాచరించి వారి మొగము నే నెట్లు చూడఁ గలను!" అని పలుకుచు రాజేకొంత సందేహపడెను. "అట్లుకాదు. నీవు స్వయముగఁబోయి నీటి పొప్పుకొన్నఁగాని నీకు భయంకరముగాని శాపమును మాతండ్రి యిచ్చును, నేను విశేషముగ మాటలాడఁ జాలను. బాధ భరింప శక్యము

గాకున్నది. నా ప్రాణములు పోకున్నవి. కనుక బాణము ఊడఁ బెఱికినన్ను కడతేర్పుము" అని ముని బాలకుఁడు చెప్పెను.

అంత రాజు బాణమును ఊడఁదీసెను. మునికుమారుఁడు ప్రాణములు విడిచెను.

రాజు ముసలి దంపతులయొద్దకుఁ బోయి కూరుచుండెను. కాలిచప్పుడు విని కొడుకు వచ్చెనని వారు భ్రమించి "నాయనా! ఇంత ఆలస్యమేల చేసితివి? నీకేమియును ఆపద సంభవింప లేదుకదా?" అని యడిగిరి.

రాజు మాటలాడక ఊరకుండెను. "నాయనా నీవు మాతో ఏలమాటాడవు? నీకు మాపై కోపమేల కలిగెను?" అని దీనులై ముసలియంధులు విలపింప మొదలిడిరి.

అంత, చేసినతప్పంతయు రాజొప్పుకొని 'క్షమించినను సరే, శిక్షించినను సరే, అని వారితో పలికెను. వారు మూర్ఛపడి కొంతసేపటికి తెలివినొంది యేడువసాగిరి. ఏడ్చియేడ్చి, "రాజా! నీవు మాకొడుకున్న చోటికి మమ్ముతీసికొనిపొమ్ము," అని చెప్పిరి.

రాజు వారిని నదియొద్దనకు కొనిపోయి మునికుమారుని సమీపమునను విడిచెను. వారనేకవిధముల దుఃఖించి యిట్లు తీవ్రముగా పలికిరి. "నరఘాతుకుఁడా! అంధులము, ముసలివారము. మాకున్న ఒక్కకొడుకును నీపొట్టను పెట్టుకొంటివి. ఇఁక మాకు గతిలేదు. మేము మాపుత్రుని వదలియుండఁ జాలము. పుత్రశోకమున నీవు మావలెనే మృతినొందుదువు గాక!"

ప్రశ్నలు—1. దశరథుఁడు మునికుమారు నేల బాణమునఁ గొట్టెను? 2. అతఁడు దశరథునితో నేమిచెప్పెను? 3. మునికుమారుని తండ్రి దశరథున కేమని శాపమిచ్చెను?

మాటలు,—సాధారణముగా, నీటిపట్టు, మాటు, చాయ, ఆర్ద్రరవము, వనమృగము, దేజస్సంపన్నుండు, అపరాధము, దాహపీడితులు. తీర్థము, ఘోరకృత్యము, దంపతులు, మూర్ఛపడు.

---

## 27. ఆరోగ్యసాధనములు, నీరు.

నీటిని శుభ్రపఱచి త్రాగుటయు, మంచిగాలిని పీల్చుటయు, మంచి ఆహారమునే భుజించుటయు ఆరోగ్యమునకు ముఖ్యసాధనములని వెనుకటి వాచకపుస్తకమునందు మీరు చేదివియున్నారుగదా! ఇప్పుడు నీటినిగుఱించి కొంచెము ఎక్కువగా నేర్చుకొనిమెదరు.

భూమిమీఁద ప్రవహించుటకుముందు, వాననీరు నిర్మలముగానుండునని మీకు తెలియును. నిర్మలమైన ఆనీరు రుచిగానుండును. మన చుట్టునుండు గాలిలోని వాయువులు కొన్ని అందులో కలియుటవలన దానికికొంత రుచివచ్చినది. అచ్చమైన నీటికి రంగుగాని, రుచిగాని యుండదు. కాని, కొంచెము రుచిగానుండి, రంగుమాత్రము లేనిదానినే మనము మంచినీరనుచున్నాము. నీటికి రంగును, రుచియు ఎట్లువచ్చుచున్నవో మనము తెలిసికొనవలసియున్నది.

నిర్మలమైన వాననీరు భూమిమీఁద ప్రవహించునప్పుడు అందలి పదార్థములు కొన్ని నీటితో కలిసియుండును. అందువల్లనే నీటికి రంగును, రుచియు కలుగుచున్నవి.

వానిలో కొన్ని, ఉప్పువంటివి నీటిలో కరఁగిపోవును. మఱికొన్ని, అట్లు కరఁగక నీసుసున్నమువలె నీటిలో వేఱుగా

ఉండును. నీటిని వడఁబోసి, దానిలో వేఱుగానుండు పదార్థము లను దీసివేయఁగలము. కాని కరఁగినవానిని అట్లు తీయలేము,

నీటిలోనుండు పదార్థములో కొన్ని ఖనిజసంబంధములు. కొన్ని వృక్షసంబంధములు, కొన్ని జంతుసంబంధములు.

జ్వరము, అజీర్ణము, గ్రహణి, అతిసారము, విషూచి, మొదలగు వ్యాధులన్నియు, జంతు వృక్షసంబంధమైన పదార్థముల వలననే కలుగుచున్నవి. ముఱుగుడు కాలువయొక్కయు, ముఱికిగుంటల యొక్కయు సంపర్కము మనము త్రాగు మంచినీటికి ఉండవచ్చును. విషూచిచేత చచ్చిన జంతువు లెన్నియో, నదీ తటాకాదుల యందలి జలమున ప్రవేశింప వచ్చును. అట్టి జలము త్రాగుటచే విషూచివచ్చును. కాన, నీటిని శుద్ధిచేసికాని త్రాఁగకూడదు.

పెద్ద పట్టనముల గొట్టముల మూలమున నీటిని పంపె దరు. అచ్చట అందుల కేర్పడిన పై యధికారులే ఆనీటిని శుభ్రపఱతురు. అయినను దానినికూడ కాఁచి పుచ్చుకొనుట మంచిది.

మిగిలినచోట్ల నీటిని మఱిఁగించి, వడఁబోసి మఱి త్రాగ వలయును. అట్లు మఱిఁగించుట వలన నీటిలోనుండు విష వాయువును. ఎగిరిపోవును. విషూచి మొదలగు వ్యాధులకు మూలములగు క్రిమి సముదాయము చచ్చిపోవును. కాని, కాఁచిన నీరు. రుచిలేక చప్పగానుండును.

ఇందుగుకాయ అఱుగఁదీసి నీటిలో కలిపి, ఆనీటి నొక చోట కదల కుండున ట్లుంచవలెను. నీటిలో వేఱుగానుండు పదార్థమును దానితోకూడి, పాత్ర అడుగు భాగమునకు

చేరును. అప్పుడు అడుగుననున్న కల్మషమును కదల్పకుండ పైనితేలిన నీటిని మఱియొకపాత్రలో పోయవలెను. ఇది రెండవ విధము. కాని, మిక్కిలి చిన్నవియగు క్రిమి సముదాయము ఈ నీటిలోనే యుండిపోవును. కాన, దీనినిగూడ కాచుటమంచిది.

ఇందుగు కాయకు బదులుగా పటికపొడుమును ఉపయోగింపవచ్చును. నాలుగు సేర్ల నీటిలో అయిదారు వడ్లగింజెల యెత్తు పటిక పొడుము వుంచి దానిని తేర్చి తీయవలెను. ఇందుగు చేయుపనియే పటిక కూడ చేయును.

ధనవంతులు కొందఱు "ఫిల్టరు,, అను "గాలనపాత్ర"ను కొని దానితో నీటిని శుభ్రపఱచుకొందురు. దానిలో, ఇసుక, బొగ్గు పొరలుండును. అవి కల్మషపదార్థములను పట్టుకొని ఆపి, మిగిలిన స్వచ్ఛమైన నీటినే క్రిందికిపోనిచ్చును.

ప్రశ్నలు:— 1. ఆరోగ్యమునకు ముఖ్యసాధనము లేవి? 2. నీటికి రంగు రుచి యెట్లు కలుగుచున్నవి? 3. నీటిలో కరఁగక దానిలో వేఱుగా నుండు పదార్థముల నెట్లు తీసివేయవచ్చును? 4. చెడ్డనీటిని త్రాగుటవలన నే వ్యాధులు పుట్టును? 5. అట్టివి రాకుండఁ గాపాడుకొను మార్గములు కొన్ని చెప్పుము

మాటలు.—శుభ్రపఱచుట, భుజించుట, నిర్మలమైన ఖనిజము, నృకము, మఱఁగించుట, వడఁబోయుట.

---

## 28. పూండి, రంగనాథ మొదలిగారు.

పూండి రంగనాథ మొదలిగారు 1847 వ-సంవత్సరమున మదరాసులో జన్మించెను. ఈతఁడు బాలుఁడై యుండఁగా ఈతనితండ్రి ఉద్యోగవశమున 'యుపనోషి, యను గ్రామము నకుపోవలసివచ్చెను; అక్కడ ఈతనియింట ఒకరాత్రి బంది

పోటుదొంగలు పడిరి. దొంగలవలన అపాయము సంభవింప కుండ తనప్రియపుత్రుఁడగు రంగనాథమును అటుకమీఁద దాఁచితాను దొంగలయెదుటికి పోయెను. తనకున్న ధనము నంతయు వారియెదుట పెట్టి వారి అధీనము చేసెను.



"ఇంకను నీయింటిలో సొమ్మున్నది. నీవెచ్చటనో దాఁచితివి. చెప్పకున్న యెడల నీ గొంతుకోయుదుము" అని దొంగలు బెదరించిరి.

ప్రాణతుల్యుఁడైన కొడుకు రంగనాథము తక్క నాకు ఇంక మఱి యేసొత్తును లేదనియు, ఆతనిని అటుకమీఁద దాఁచితిననియు గడగడవడఁకుచు అతఁడు చెప్పెను.

అప్పుడు రంగనాథమును అటుకమీఁదినుంచి దొంగలు దింపిరి. ఆబాలుఁడు దొంగలతో ఆడిన మృదువాక్యముల వలన దొంగ లెవ్వరికిని ప్రాణహాని చేయకుండ ధనము మాత్ర మే తీసికొని పోయిరి.

రంగనాథమునకు ద్రవిడభాషలో విశేషపాండిత్యముకలదు. 1860 వ-సంవత్సరమున అతఁడు 'పచ్చయప్ప' పాఠశాలలో మూఁడవతరగతిలో ప్రవేశించెను. అది యిప్పటి నాలుగవ ఫారమునకు సమానము. ఆసంవత్సరమున అతఁడు అఱువది రూపాయల విద్యార్థివేతనమును సంపాదించుకొనెను. ఆసంవత్సర పరీక్షలో ఇతనికివచ్చిన 'మార్కు' లను బట్టి ఉపాధ్యాయుఁడు ఇతనిని నడిమితరగతిలోచేదువ నక్కఱ లేకుండనే మెట్రిక్యులేషను క్లాసులో వేసెను.

ఆంగ్లేయభాషాపాండిత్యమునందునుగణితశాస్త్రమునందును ఈతఁడు, అనేక బహుమతులను సంపాదించుకొనెను. స్త్రీ విద్యనుగూర్చియీతఁడు వ్రాసినఉపన్యాసము సర్వోత్కృష్టమని న్యాయవాదులలో నొక్కరగు మెయిన్ దొరగారును; హైకోర్టు న్యాయాధికారులలో నొక్కరగు హాలోవే దొరగారును తీర్మానించిరి.

1865-వ సంవత్సరమునఁ బట్టపరీక్షలో మొదటి తరగతిలో రంగనాథము కృతార్థుఁడై తిరువాన్కూరు మహారాజిచ్చిన మూఁడువందల రూపాయలను, బంగారు పతకమును బహుమానములుగా గ్రహించెను.

అతనితో సమానముగా ఇంగ్లీషు వ్రాసి మాటలాడఁగలవారు ఆంగ్లేయులలోనైన మిక్కిలితక్కువగానుండిరని చెప్పుదురు. ఎంతవానికైన విశేషపాండిత్యము ఒక్కశాస్త్రమందుండును గాని అన్నిటను ఉండదు. ఈతనికో, గణితశాస్త్రమందును,తత్త్వశాస్త్రమందును, ఆంగ్లేయభాషయందును, ద్రావిడభాషయందును, చరిత్రగ్రంథములందును, సంపూర్ణ పాండిత్యము కలదని వాడుక.

ఇతని బుద్ధికుశలతను చూచి విడువలేక ఈతని గురువగు "టామ్సను" దొరగారీతనిని తనకాలేజిలోనే గణితశాస్త్రోపాధ్యాయునిగా నియమించెను. అప్పటినుండియు పవిత్రమగువిద్యాబోధనమందే యీతఁడు తనకాలమును గడపెను.

ఈతనిబుద్ధి విశేషమునకు మెచ్చి దొరతనమువారు ఈతని ఆలోచనములను విద్యావిషయములందే కాక, యితర విషయములందుఁ గూడ తీసికొనుచుండిరి. రంగనాథము నిజముగా హిందువులలో మణి యని చెప్పవచ్చును. ఈతఁడు 1893వ- సంవత్సరమున కాలధర్మము నొందెను.

ఈతఁడు ద్రావిడభాషలో ఒక పద్యకావ్యమును రచియించెను. దానివలన ఈతనిపాండిత్యమెంతయో తెలియనగునఁట.

ప్రశ్నలు:—1. రంగనాథ మెుదలిగా రే సంవత్సరమున జన్మించిరి? 2. ఇతనియింట బందిపోటు దొంగలుపడినప్పుడు తండ్రి యితని నేమిచేసెను? 3. ఇతఁ డేయుద్యోగమును జేసెను? 4. ఎప్పుడు మృతినొందెను?

మాటలు:—ఉద్యోగ వశమున, ప్రియపుత్రుఁడు, ప్రాణతుల్యుఁడు, మృదువాక్యములు, విశేషపాండిత్యము, విద్యార్థివేతనము,బుద్ధిచాకచక్యము, ఉపన్యాసము, సర్వోత్కృష్టము, తత్త్వశాస్త్రము, విద్యాబోధనము.

# 29. వృక్షములు, వృక్షకాండములు.

చెట్టునకు వేళ్లు,కాండము(బోదె), ఆకులునుముఖ్యభాగము లని మీరు వెనుకటివాచకపుస్తకమునందు చదివియున్నారు. వేళ్లు భూమిలోనుండి ఆహారమును నీటితో పీల్చుకొనుననియు, గాలికి పడిపోకుండ చెట్టును నిలఁబెట్టుననియు చదివియున్నారు. ఆకులు మఱి కొంతఆహారమును గాలినుండి పోగుచేయుననియు, వేళ్లనుండి వచ్చిననీటిని గాలిలోనికి వదలివేయు ననియుఁ గూడ చదివియున్నారు. ఇఁక కాండము యొక్క ఉపయోగ మేమని మీరడుగవచ్చును.

కొమ్మలను, రెమ్మలను, ఆకులను భరించి, వానికిగాలియు సూర్యరశ్మియుతగులులాగున పైకివ్యాపింపఁజేయుట దాని ప్రయోజనములలో ఒకటి. వేళ్లనుండివచ్చునట్టి ఆహారపదార్థములను ఆకులలోనికి తీసికొనిపోవుటయు, ఆకులలో తయారుచేయఁబడిన పదార్థములను చెట్టునకు కావలయు చోట్లకుతీసికొనిపోవుటయు, కాండముయొక్క రెండవప్రయోజనము. ఎండకాలములలో ఆకులురాల్చుకొని చెట్లు మొరళ్లైపోవుట మీరు చూచియేయుందురు. వానలుకురియఁగానే మఱల అవి చిగిర్చి ఆకులువేసి, మొగ్గతొడుగుటకు కావలసినపదార్థములను, ముందుగా కాండము దాఁచి పెట్టుకొని యుండును. ఇదియే దాని మూఁడవప్రయోజనము.

స్కంధము శాఖలు, ఉపశాఖలును కాండములోనివేకాని అన్నివృక్షములకు కాండము ఒక్కరీతిగానే యుండదు.



మఱ్ఱి, మద్ది, మామిడి మొదలగు చెట్లయొక్క కాండము, కొమ్మలు రెమ్మలు గలదిగానుండును. అంతకంతకు కాండము లావుగాఁ బెరుఁగు చుండును. కొబ్బెర, తాడు, పోఁక మొదలగు చెట్లకు కొమ్మలుండ వు. వీనిని "తృణద్రుమము" లం దురు. కొమ్మలు లేక సోఁగ గాతృ ణము (గడ్డి)వలె పైకి పెరుఁగును గాన, వీని కా పేరువచ్చెను. పైని భారమెక్కువగా నుండు చెట్లకు కాండము లావుగా నుండును.





సాధారణముగా ఒక్క సంవత్సరము మాత్రమే జీవించియుండు బెండ, వంగ, వరి, జొన్న, చెఱకు మొదలగు మొక్కలకు కాండము సన్నముగా నుండును. చేవ దేఱియుండదు.

బలుసు తుప్ప, మల్లె, గులాబి మొదలగువానిని "తుప్ప" లందురు. తుప్పలకే గుల్మములని పేరు. ఇవికూడ చెట్లవలెమ్రాను గట్టును. కానిమ్రాను కడుసన్నముగానుం డును. చెట్లకుకొంత యెత్తునుండి కొమ్మలు బయలుదేఱును. వీనికి మొదటినుండియు చిన్న రెమ్మలు బయలు దేఱును.



చిక్కుడు, దొండ, బీఱ, కాఁకర. చిరుగడము మొదలగునవి లతలు. లత లనఁగా తీఁగలు. వీనికాండ మొంతమాత్రమును.

దృఢముగానుండకపోవుటచేత వంగిపోవు స్వభావముగలది. వీనిలో కొన్ని పాఁతినవెదుళ్లనో, సమీపమున నున్న మఱియొక వృక్షమునో చుట్టుకొని ప్రాఁకును. కొన్ని తీఁగలకు, నులితీఁగ లుండును. అవి వానితో సమీపమున గుచ్చినకంపను బట్టుకొని పైకి ప్రాఁకును. కొన్నిటికి కనుపు కనుపునొద్దను వేళ్లు పాఱును. అట్టివి కొన్ని నేలమీఁదనే ప్రాఁకుచుఁ బోవును.

పెండలము, చేమ, కంద, ఉల్లి మొదలగువాని దుంపలు కాండములు. ఇవి క్రిందికి వేళ్లుపాఱును. పైకి, ఆకులు పెట్టును. ఇట్టిదుంపలు వేళ్లని భ్రమపడఁగూడదు.

ప్రశ్నలు.—1. కాండముయొక్క ప్రయోజనముకేమి? 2. చెట్లకును మొక్కలకునుగల భేదమేమి? 3. తుప్పలకును చెట్లకును గల భేదమేమి? 4. తీఁగలలోని కొన్ని రకములు చెప్పుము. 5. కందదుంప, చేమదుంప యివి వృక్షముయొక్క యేభాగములు?

మాటలు.—వృక్షము, కాండము, రెమ్మ, భరించుట, రశ్మి, ప్రయోజనము, మొఱడు, స్కంధము, శాఖ, ఉపశాఖ, సోగగా, భారము, స్వభావము, కనుపు, భ్రమ.

---

# 30. ఎడ్వర్డు చక్రవర్తిగారు.

వీరు మన యిప్పటి చక్రవర్తిగారైన శ్రీజార్జిగారి తండ్రిగారు. వీరితల్లి జగత్ప్రసిద్ధిఁ గాంచిన శ్రీవిక్టోరియా చక్రవర్తినిగారు. తండ్రి దైవభక్తిగల ఆల్బర్టుప్రభువువారు.

వీరు 1841-వ సంవత్సరము, నొవెంబరు. తొమ్మిదవ తేదిని జన్మించినారు. 1902-వ సంవత్సరము, ఆగస్టు, తొమ్మిదవ తేదిని పట్టాభిషిక్తులైనారు. 1910-వ సంవత్సరము, మే ఆఱవ తేదిని స్వర్గస్థులైనారు. కనుక కొలఁదికాలమే, రాజ్యముచేసినారు.



విక్టోరియాగారి పట్టాభిషేక సమయమున మనదేశము వణిక్సంఘముపరిపాలనలోనున్నది. కావున, హిందూదేశచక్రవర్తిగా ఇంగ్లండులో పట్టాభిషిక్తులగుటకు వీరే ప్రథములు.

రాజ్యముచేసినది కొలఁదికాలమైనను, గొప్పయశస్సునంపాదించినారు. చిరకాలమునుండి బద్ధవైరులుగానున్న పరరాజులను (ఫ్రెంచివారిని) పరమమిత్రులుగా చేసికొన్నారు. వీరైనంత వఱకు ప్రపంచమం దంతటను శాంతి నెలకొల్పినారు. కావున వీరికి "శాంతికరుఁడు" అను బిరుదుకలదు.

మొట్టమొదటినుండియు ఈయననిర్గర్వుడు. హీనజాతులస్థితి తనంతటతానే కనుగొని బాగుచేయవలెనని, ప్రచ్ఛన్నముగా గొన్నాళ్లుసంచరించెను. ప్రజలయందు మిక్కిలిదయగలవాడు. పిల్లలన్న ఈయన కెంతో ప్రేమ. ఈక్రింది కథ యథార్థమైనది. ఎడ్వర్డుగారు రాజ్యమునకు రాకముందే జరిగినది. అది చేరివిన యెడల వారియోగ్యత స్పష్టమగును.

ఒకరోజున. రాజభవనమునకెదుట, ఒకబాలుడు, కన్నులు నలుపుకొనుచు, వెక్కివెక్కి యేడ్చుచుండెను. తొందరగా పోవుచున్నను, ఎడ్వర్డు దీనిచూచి, ఆగి, పిల్లవాడేల యేడ్చుచున్నాడని యడిగెను.

బాలుడిట్లు మనవిచేసికొనెను:—

“మహారాజా! నాకు రాణిగారిని చూడవలెననియున్నదని నాతో అన్నాడు. నీవంటివాడెట్లుచూడగలడు, వెఱ్ఱివాడా! పొమ్మన్నాను. అప్పటినుండియు ఇట్లేడ్చుచున్నాడు.”

అంతట, జాలిపడి, ఎడ్వర్డు ఆపిల్లవానిని బుజ్జగించి, చేయి పట్టుకొని—“నాతోరా! నీకేమియు భయములేదు. ఇక్కడ అందఱు నాయాజ్ఞకు బద్ధులు. నీకు రాణిగారిని తప్పకుండ చూపెదను” అని లోపలికి తీసికొనిపోయి, జగన్నాతవలె కూరుచున్న తనతల్లియగు విక్టోరియాగారియెదుట పెట్టి, జరిగిన దంతయు ఆమెతో జెప్పెను.

విక్టోరియాగారు, “నీపేరేమి? నీకెన్నేండ్లున్నవి?” అని ఇట్టి ప్రశ్నములెన్నో, ఎంతోదయతో అడిగి, వాని జవాబులకు చిఱునవ్వులు నవ్వుచు ఆచిన్నవానిని సంతోషపెట్టి, ఒక బంగారుకాసు బహుమతిచేసి పంపివేసెను.

ఆపిల్లవాఁ డిప్పుడు ముసలివాఁడై యున్నాఁడఁట. అన్నవస్త్రములకు నేక కష్టములుపడి యుండవచ్చును; కాని, రాణిగారిచ్చిన ఆ ధనముమాత్రము మార్చుకొని తినలేదు. పెన్నిధివలె కాపాడుకొనుచున్నాఁడు.

విక్టోరియారాంగా రిప్పుడు లేరు. ఎడ్వర్డుప్రభువుగారును గతించినారు; కాని, వారి కృపాకృత్యములుమాత్రము పోలేదు. ఎన్నఁటికిని పోవు.

ప్రశ్నలు:—1. ఎడ్వర్డుగారి బిరుదేది? అట్టిబిరు దేలవచ్చెను? 2. వారి సద్గుణములు మఱిరెండు చెప్పుము. 3. పిల్లవాఁడేలయేడ్చుచుండెను? 4. అప్పు డెడ్వర్డుగా రేమిచేసిరి? 5. ప్రపంచములో వేనికి మృతిలేదు?

మాటలు.—జగత్ప్రసిద్ధి, పట్టాభిషిక్తుఁడు, సద్గుణములు, యశస్సు, బద్ధవైరులు, నెలకొల్పు, శాంతికరుఁడు, ప్రచ్ఛన్నముగా, నిర్గర్వుఁడు, ద్వారపాలకుఁడు, కృపాకృత్యము, జగన్మాత, పెన్నిధి.

---

# 31. ఉత్తర ప్రత్యుత్తరములు.

## వానిపై విలాసములు.

ఉత్తరములు, ఇతరమైన కాగితములు, పుస్తకములు, ఔషధములు మొదలగు వస్తువులు, అతిస్వల్పమైన ఖర్చుతో ఎంతదూరమైనను పంపుటకు తగినఏర్పాట్లు ప్రభుత్వమువారు చేసియున్నారు.

కార్డుమీఁదవ్రాసి అణాఖర్చుతో, కాకినాడనుండి కలకత్తాకు, రెండురోజులలోపల, వార్తలుపంపవచ్చును. ఇంకొక అణావ్యయముతో, రిప్లైకార్డుమీఁద, మఱి రెండురోజులలో, ప్రత్యుత్తరము తెప్పించుకొనవచ్చును. [కార్డులనగా దళసరి కాగితపుచీటి. రిప్లై అనఁగా జేవాబు].

"చిరునామామాత్రమే" అని ముద్రించిన భాగమున ఇతరము ఏదియును వ్రాయఁగూడదు. కార్డుయొక్క తక్కిన చోట్ల, మనయిష్టము వచ్చిన సంగతులువ్రాసికొనవచ్చును.

ఇట్టిపోస్టుకార్డులు పోస్టాఫీసులో, అణా అణాకు దొరకును. జేంటకార్డులు ఒక్కొకటి అణా అణాకు దొరకును. బజారులో కొన్నఉత్తకార్డులమీఁద కూడ ఉత్తరమువ్రాసి, అణాబిళ్ల అంటించి పంపవచ్చును. అట్టి కార్డులు పోస్టాఫీసులో కొనుకార్డ్లకంటె పలుచేగాఉండఁ గూడదు.

జేరూరుగా జేవాబుకావలసివచ్చినపుడు జేంట కార్డు పంపుచుందుము. అప్పుడు రిప్లైకార్డుమీఁద విలాసము వ్రాయు

చోట, మన పేరును, ఉద్యోగమును, ఉనికిపట్టును, పూర్తిగా వ్రాసి మతిపంపుచేయుదుము. అట్లుచేయుటవలన, ఆకార్డు సాధారణముగా అన్యథా ఉపయోగపడదు. వెంటనే జేవాబు వచ్చుటకు వీలుగా ఉండును.

విషయము హెచ్చుగా ఉన్నప్పుడుగాని, రహస్యముగా ఉండవలసినప్పుడుగాని, జేబు కాగితముమీఁదవ్రాసి, ఒకకవరు లో [కవరు అనఁగా కాగితపుసంచి] పెట్టి, దానిని మూసి, తూనికనుబట్టి పైనిబిళ్లలు అంటించి పంపుదుము. ఇట్టి కవర్లకు పోస్టుఖర్చు అణాకు తక్కువగా ఉండదు. చివరనున్న అనుబంధము చూడుము.

జేంటకార్డుగాని, ఉత్తరపు కవరుగాని గుండుసూదులతో గ్రుచ్చి పంపఁగూడదు.

పుస్తకములు, వార్తాపత్రికలు, మచ్చుగుడ్డలు, మచ్చుగింజేలు, మచ్చుమందులు మొదలగువర్తకపు సరకులు, ఛాయా పటములు [ఫొటోగ్రాఫులు] ప్రకటన పత్రికలు [నోటీసులు] ఉత్తరములయొక్క నకళ్లు, మున్నగునవి తక్కువ పోస్టేజితో [టపాఖర్చుతో] పంపుటకనుకూలించును.

ఇట్టివానిని కలిపి కట్టలుకట్టి, బుక్పేకెట్టు [Book packet] అనిగాని పేటరన్పేకెట్టు [Pattern packet] అనిగాని పైని వ్రాసి కావలసినబిళ్లలు అంటించి పంపుదుము. ఇట్టివానిలో ఉత్తరములు పెట్టఁగూడదు. అనుబంధము చూడుము.

వీనిని, ఉత్తరములవలె, రెండుప్రక్కలను అంటించి పంపఁగూడదు. పంపఁగూడనివస్తువులు లోపలపెట్టినారేమోయని అధికారులకు అనుమానముకలిగినప్పుడు, పరీక్షించి చూచుటకు వీలుగా ఉండవలెను. వస్తువులు జాగ్రత్తతో కట్టవలెను.

ఏఁటేఁట రెజిస్టరు చేయించు వార్తాపత్రికలు మిక్కిలి చౌకగా పంపఁబడును. అనుబంధము చూడుము.

పార్సెల్పోస్టు [పార్సెల్ అనఁగా బంగీ] చేసి, వెక్కుసరకు లు పంపవచ్చును.

తుపాకిమందు మొదలగు ప్రేలువస్తువులు, అపాయకరములు అసహ్యములు అగువస్తువులు,నల్లమందు గంజాయి మున్నగు నిషిద్ధపదార్థములు, చూచుటకు సిగ్గగు దిగంబరప్రతిమలు, అనుచితములైన వ్రాఁతలు, టపాసరకులను పాడుచేయు పదార్థములు-ఇట్టివి బంగీపోస్టులో పెట్టఁగూడదు.

బీమా [ఇన్షూ్యరెన్సు] చేయని వెండిబంగారపునగలు నాణెములు, కరెన్సీనోట్లు [నాణెములకు ప్రతిగాచెల్లుబడియగు కాగితములు] ఇట్టివికూడ సాధారణపు బంగీపోస్టు మూలముగా పంపఁగూడదు.

బంగీసరకులను మంచిపెట్టెలలోఁగాని, డబ్బాలలోఁగాని, సంచులలోఁగాని పెట్టి దిట్టముగాకట్టి, పంపవలెను. లోపలిసరకులు కనఁబడునట్లు కట్టఁగూడదు. జాగ్రత్తగా అన్ని మూలలు మూయవలెను.

బిల్లలంటింపకుండ ఉత్తరములు, పేకెట్లు, పంపవచ్చును గాని, యీబంగీలకు ముందుగా పోస్టేజితప్పకుండ చెల్లింపవలెను:—అనఁగా కావలసిన బిళ్లలంటించి మఱి వానిని పంపవలెను.

ఓపాలో తీసికొని వెళ్లుటకు అనుకూలమైన పరిమాణము ఆకారము ఉండునట్లు జాగ్రత్తగా బంగీలను కట్టవలెను. అనుబంధము చూడుము.

బంగీలో, ఆచిరునామాదారునకే వ్రాసిన ఒక ఉత్తర
ముంచేవచ్చును. ఒకటికంటె ఎక్కువ ఉత్తరములు పెట్టఁ
గూడదు.

ఇట్టిబంగీలు పోస్టాఫీసులో పోస్టుమాస్టరుగారికి ఈయ
వలెనుగాని, పేకెట్లవలెను ఉత్తరములవలెను టపాపెట్టెలో
పడవేయఁగూడదు.

కార్డులు బిళ్లలంటింపకుండ పడవేయఁ గూడదు. పడవేసి
నచో చింపివేయుదురు. ఉత్తరముగాని పేకెట్టుగాని బిళ్లలం
టింపకుండ పంపినయెడల, చిరునామాదారుని యొద్దనుండి
పోస్టేజి రెండు రెట్లుపుచ్చుకొందురు. అనఁగా అణాఉత్తర
మునకుఁ గాని అణాపేకెట్టునకుఁ గాని రెండణాలు పుచ్చు
కొందురు.

పోస్టేజితక్కువ లంటించినయెడల, ఎంతతక్కువ అయినదో
దానికి రెండురెట్లు చిరునామాదారు చెల్లింపవలసియుండును.
రెండణాల బిళ్లలకుబదులు ఒకఅణాబిళ్ల అంటించినయెడల,
చిరునామాదారు ఉత్తరము పుచ్చుకొనునప్పుడు రెండణాలీయ
వలెను.

ఇప్పుడు అమలులో ఉన్న పోస్టేజి వివరములు అనుబంధ
ములో చూపినాము. అవి మనదేశమునకే కాని పరదేశము
నకు పంపు ఉత్తరములు మొదలగువానికి వర్తింపవు.

**ఉత్తరములు మున్నగునవి బట్వాడా చేయుటలో పొర
పాటులేమియు లేకుండునట్లు విలాసములు అతిజాగ్రత్తతో
వ్రాయవలెను.**

ఒక పేరువారు, ఒక యింటిపేరువారు, పెక్కురుండవచ్చును. ఒక పేరే వేలువేలుచోట్లనున్న అనేక పట్టనములకు గ్రామము లకు ఉండవచ్చును. కావున చిరునామా సిసలుగా స్పష్టముగా వ్రాయవలెను. పోస్టాఫీసులేని కుగ్రామమునకు ఉత్తరములు మొదలగునవి పంపునప్పుడు దగ్గఱగానున్న పోస్టాఫీసుస్థలముకూడ వ్రాయవలెను. జిల్లా, రాష్ట్రము, కూడ వ్రాయుటమంచిది. చిరు నామాదారు అప్రసిద్ధుఁడై, ప్రసిద్ధుఁడైన ఎవరియింటనో ఉండు నెడల, ఆప్రసిద్ధపురుషుని పేరుగూడ వ్రాయుట మంచిది.

గ్రామనామములు జిల్లాపేరులు మున్నగునవి పోస్టుముద్ర లలో ఎట్లుండునో అట్లే వ్రాయవలెను. హిందూదేశములో రాష్ట్రములఁబట్టియు, జిల్లాలఁబట్టియు, వ్యావహారిక భాషలు వేఱుగా ఉన్నవి. కాని, రాజభాషయగు ఇంగ్లీషు సర్వత్ర వాడుకలో ఉన్నది. కనుక అట్టిపేర్లు ఇంగ్లీషుతో వ్రాయుట మంచిది.

మఱొకమాట మఱచిపోఁగూడదు. చిరునామాదారు కనఁబడకపోవుట చేతనో, యితరకారణములవలననో, బట్వాడా కాని ఉత్తరములు మొదలగునవి, పంపినవారికే తప్పకుండ తిరుగ పంపవలసివచ్చును. పంపినవారిపేరు ఉద్యోగము ఊరు మున్నగునవి విలాసములో ఉండనియెడల, అవికనుఁగొనుటకు విప్పి లోపల చూడవచ్చును. అందువలన ఆలస్యము అగు ను. అట్లుచేసినను తెలియనియెడల, ఆయుత్తరములో పేకెట్లో చింపిపాఱవేయవలసి వచ్చును.

అట్టి చిక్కులుతటస్థింపకుండ, ఎడమవైపు అడుగు భాగమున, పంపువారివిలాసము స్పష్టముగా వ్రాయవలెను. ఈక్రింది మచ్చు విలాసము చూచుకొనవలెను.



బిళ్ల.

మ-రా-శ్రీ.

పత్రి. సుబ్బారావుగారు.

c/o

యోగి శారదానందస్వామిగారు,

17, స్టేషన్రోడ్డు,

హైదరాబాదు, దక్కను.

**HYDERABAD, DEKHAN**

మునగల సూర్యప్రకాశరావు
డ్రాయింగు మాస్టరు.
ఆర్- సి. ఎచ్. హైస్కూలు
పిఠాపురము, గోదావరిజిల్లా.

# 31-వ పాఠమునకు అనుబంధము.

## పోస్టేజి రేట్లపట్టిక.

| తరగతి | వివరము | రేటు |
|---|---|---|
| పోస్టు కార్డులు. | సింగిలు. | ½ అ. |
| | జంటకార్డు. | 1 అ. |
| ఉత్తరములు. | 2½ తులములు దాటనివి. | 1 అ. |
| | పైవాటిపైన ప్రతి 2½ తులములకును గాని, అందలి భాగమునకును గాని. | 1 అ. |
| బుక్కు పోస్టు పేటర ప్యాకెట్టులు | ప్రతి పది తులములకును గాని, అందలి భాగమునకును గాని, | ½ అ. |
| బంగీలు [తప్పక పోస్టేజి ముందుగా చెల్లింపవలెను.] — 440 తులములు దాటనివి. | 20 తులములు దాటనివి | 2 అ. |
| | 20 తులములు దాటి, 40 తులములకు మించకుండునవి | 3 అ. |
| | పైవాటిపైన ప్రతి 40 తులములకును గాని, అందలి భాగమునకును గాని | 3 అ. |
| బంగీలు — 440 తులములు దాటినవి, [రిజిస్ట్రీ వీనిని తప్పక చేయింపవలెను] | 440 తులములు దాటినవి 480 తులములకు మించనివి. | 3 అ. |
| | పైవాటిపైన ప్రతి 40 తులములకును గాని, అందలి భాగమునకును గాని, 800 తులములవరకు. | 4 అ. |
| రిజిస్టరు చేయబడిన వార్తాపత్రికలు. | 8 తులములకు మించనివి. | ¼ అ. |
| | 8 తులములు దాటి 20 తులములకు మించనివి. | ½ అ. |
| | పైవాటిపైన ప్రతి 20 తులములకును గాని, అందలి భాగమునకును గాని. | ½ అ. |

రెజిస్టరుచేయఁబడు ప్రతిఉత్తరమునకుఁ గాని, పేకెట్టునకుఁగాని, బంగీకిఁగాని—2 అణాలు ఫీ చెల్లింపవలెను.

బీమా[Insurance] చేయఁబడు సరకుల విలువలో ప్రతి రు 50లకును, 1 అణా ఫీ.

రెజిస్టరుచేయఁబడు ప్రతిదానికిని తిరుగు రసీదు గావలసిన యెడల ఒక అణా అదనముగా చెల్లింపవలెను. బీమాసరకులకు మాత్రము అట్లు అదనముగా చెల్లింపనక్కఱలేదు.

## ప రి మా ణ ము లు.

పోస్టుకార్డు:—పొడుగు 5½ అంగుళములకంటె ఎక్కువగాను, 4¾ అంగుళములకంటె తక్కువగాను ఉండఁగూడదు.

వెడల్పు 3½ అంగుళములకంటె ఎక్కువగాను 3 అంగుళములకంటె తక్కువగాను ఉండఁగూడదు.

బుక్పేకెట్టు:—2×1×1 అడుగులకు మించేఁగూడదు. గొట్టపుచుట్టగా ఉన్నయెడల,పొడుగు 30 అంగుళములకంటె ఎక్కువగా ఉండఁగూడదు.అడ్డకొలత 4 అంగుళములుదాఁటఁగూడదు.

పేటరన్పేకెట్టు:—2×1×1 అడుగులకు మించేఁగూడదు. తూనిక 200 తులములకు మించేఁగూడదు.

బంగీ:—రెజిస్టరు చేయని బంగీ బరువు 400 తులములు దాఁటఁగూడదు. రెజిస్టరు చేయించు బంగీ బరువు 800 తులములు దాఁటఁగూడదు.

PART II.

రెండవ భాగము.

## 1. పూవులు కోయుట.

మంజరి.

తల్లి, కొమార్తె సీ౹తమ్మను బిల్చి,
"తల్లి! పూవులు మంచి౹దండ గ్రుచ్చుటకుఁ
దె"మ్మని పంపఁ బు౹త్రికలోనికేగి,
చెక్కునియాకుప౹చ్చని చీరఁగట్టి, 4
రకమైనపూవుల౹ఱవికను దొడిగెఁ,
బల్లెమొక్కటి చేతఁ౹బట్టుక, సీత
పూఁదోఁటలోనికిఁ౹బోయి తానిల్చె. 8
కొమ్మలలోనొక్క౹కొమ్మ యట్లుండఁ,
బొలుపైన పువ్వు న౹వ్వులునవ్వి మల్లె
కొమ్మలుసాఁచి యా౹కొమ్మను బిల్చె,
రామ నాసరసకు౹రాదేల యంచు,
నెఱ్ఱగన్నేరు క౹న్నెఱ్ఱచేసికొనె. 12
చిట్టిచేతుల నంత౹సీతమ్మ మల్లె
పూవులు గన్నేరు౹పూవులుగోసి
పల్లెములోఁ బెట్టఁ౹బల్లెరం బంత
వజ్రాలకెంపుల౹పల్లెరంబయ్యె. 16
పూవులన్నియుఁ గొని౹పోయి సీతమ్మ
తల్లికీయఁగఁ,దల్లి౹తనయ ముద్దాడె. 18

---

# 2. చిలుక.

గీ. ఱెక్కలును, దోఁక, పచ్చల రీతినుండు;
వంపు మొనముక్కు, పెనుఁగెంపు పగిదినుండుఁ,
గంఠమాలిక, నీలాల కరణినుండు;
నెంత చక్కనిదానవే యీవు చిలుక! 1

గీ. దొండపండును సైత "మ ట్లుండు!" మనెడు
పొల్పుగలిగిన యాలక్క ముక్కుతోడ,
మంచియడకొత్తుపోఁక ఖండించునట్టు,
లెట్లు గింజెలఁగొఱికెద వీవు, చిలుక! 2

గీ. పండ్లు గింజెలు తిని నీవు బ్రతికి, మెత్త
నాల్కతో నుస్వరంబుల నొల్కుచుందు
వెవ్వరెట్లన్న నట్లందు వీవు సరిగఁ,
గీరమా! పరిహాసకు తీరుగాను. 3

గీ. ఱెక్కలను గాలివ్రేళ్లను, ముక్కుతోడ,
ప్రాఁకుఁబట్టుక, యెల్లగఁ బ్రాఁకెదీవు!
పొడుగు గడపైని గడుఁ జిత్రముగ నటింపఁ.
జేరచేరను బోవు దొమ్మరసానిమాడ్కి. 4

గీ. ఏము మార్మెడ[1] పెట్టలే; మీవుమెడను
ద్రిప్పఁగల్గుదు వెన్కకో యొప్పులాఁడి[2]!
హొయలు నీకిట్టి వుంటనే, యువిదలందు
నందకత్తెను "జిలుక" యం చెందు రిలను. 5

ఆ. పంజరమున నుంచి పండ్లు, పప్పు, మిఠాయి,
మంచినీళ్లు, పెట్టి పెంచి, ముద్దుఁ

1. వెనుక మెడ, 2. చక్కని దానా.

బలుకులెన్నొ చెప్పి, బాలిక యలరును,1
వాని మఱల నీవు పలుకఁ జిలుక ! 6

ఆ. రామ! కృష్ణ! యంచు రవళించు, 2 చెంతరా
భక్తవరుని వలెను బలుకుచుందు ;
కాని, పిల్లి, తోఁక గ్రహియించినప్పుడు 3
పిఱికివగుచు, వాని మఱతువేమొ ? 7

ఆ. ఒక్కసతినె యంటి యుండు నుత్తముపోల్కి
శుకము ! నీవు నొక్క శుకినె 4 కూడి
యుందువంచుఁ జెప్పి యున్నారు గ్రంథాలఁ!
పక్షులందు మంచి పక్షి నీవు. 8

గీ. ఎనుబదేఁడులుఁ దొంబది యేండ్లుమీఁదు
వంశమందునఁ 5 గొందఱు బ్రతుకుదురఁట !
యొక్కచో, గుణ, మంద, మాయువును గూడఁ
గలిసియుండుట యెంత భాగ్యంబొ చిలుక ! 9

గీ. స్తోత్రపాఠములను విని శుకము పలికె
"నెన్నియున్నను నాకేది యిచట సుఖము ?
బంధువులఁ బాసి పచ్చని వనముఁ బాసి,
స్వైరసంచారమును 6 బాసి పడితిఁ జెఱను!" 10

---

1. సంతోషించును, 2. ధ్వనిచేయుచు, 3. పట్టుకొన్నప్పుడు, 4. ఆఁడుచిలుకనె, 5. జాతిలో, 6. స్వేచ్ఛావిహారము = ఇచ్ఛవచ్చినట్లు తిరుగుట.

## 3. వేము - తుంగ.

ఆ. అమలనీరపూర మగుకాల్వగట్టుపైఁ
పెద్దవేఁపచెట్టు వెలయుచుండెఁ;
చెట్టునీడయందు గట్టునంటిననీటి
ప్రక్కయందుఁ బెరిఁగె నొక్కతుంగ. 1

గీ. ఆకసంబంత యెత్తైన యట్టివేము,
క్రిందిచూపునఁ దుంగ నీక్షించి, యట్టి
శిరముపంకించి, చిఱునవ్వు చెంగలింపఁ,
ప్రబలగర్వవశంబునఁ బలికెనిట్లు. 2

గీ. మోకు తిరుగనిలావైన మొదలుగలిగి,
దెసలు గ్రమ్మినకొమ్మల పసనుగలిగి,
తారలను దారసిల్లిన తలనుగలిగి,
యెట్లునే నుంటినో చూడు మీవు తుంగ! 3

గీ. ఎంత గాలియు, ననుఁ గదలింపలేదు;
పిడుగు, మీఁదను బడినను బెదర నేను,
మృత్యువెన్నఁడు నన్ను వీక్షింపలేదు;
ధరణి నే నిల్తు నాచంద్రతారకముగ. 4

గీ. అకట! కాసంతగాలికి నైననీవు
బెదరుచును వంగి తలవ్రేల వేసికొందు,
వాకుఁదడుపు జల్లునకైన నట్టినీవు
భూమిపై వ్రాలుచునడంగి పోదు, వహహా. 5

గీ. వంగివంగి సలాములిబ్భంగిఁ, దుంగ!
యెందఱకు నీవు చేయుచు నవనియందు,

గడియగడియకు గండంబు గడపుకొనుచు
నెంత కాలము గడపఁగా నెంచినావు ? 6

గీ. నాదు పాదముఁ జేరి యున్నావు కాన,
నిన్నినాళ్లైన నిల్పితి విట్టులీవు ;
బ్రదికియుండిన, నాలాగు బ్రదుకవలయు.
నింత నీచమౌ నీబ్రతు కేటిబ్రతుకు ? 7

గీ. ఆకుజము మాటలన్నియు నాలకించి,
మనసులోఁ దుంగ యేమనుకొనెనో కాని,
కడువినమ్రత [1]నుత్తమాంగంబు వంచి
యొక్క పలుకైనఁ బలుకక యూరకుండె. 8

గీ. అంతలో స్వాతి యనుకార్తె యంతరించె ;
వచ్చెను విశాఖ, వెనుకాడఁ జొచ్చె వార్ధి,
ప్రబలవాయువు వీచె రై రయ్యి ! మనుచు
పెళ్లుమని యట్టె విఱిగెను వేఁపచెట్టు. 9

గీ. అంతగాలికిఁ గూడఁ గాసంతయైనఁ
జెదరులేకుండఁ దలను జెచ్చెరను వంచి,
కష్టకాలంబు, నమ్రతఁ గడపుకొనుచు,
నుర్వి సుఖమునఁ జిరకాల ముండెఁ దుంగ. 10

గీ. అవని నాయంతవాఁడు లేఁ డనుచు మిడిసి
పడెడువాఁ, డెప్పుడును, వేమువలెను జెడును,
వినయవంతుఁడు, తుంగలాగునను, కష్ట
సంతతిఁ దరించి సుఖమున సంతసించు. 11

---

1. శిరస్సు=తల.

# 4. పొట్ట - ఇతరావయవములు.

గీ. తిండియంతయుఁ బొట్టనే | నిండఁజేయు
నంచు, నితరము లౌనవ | యవము, లీర్ష్య,
నొక్కచోటను సభఁగూడి | డొక్కపొగరు
నేకమై యడఁపఁగ నిశ్చయించుకొనియె. 1

ఆ. పాటుపడుట మనది, | ఫలమంత కడుపుది,
యిట్టిన్యాయ మెచట | నేని కలదె?
యంచుఁ గాళ్లు గన్ను | లాదిగాఁగలవన్ని,
వానివానిపనులు | మానుకొనియె. 2

గీ. మనము పనిచేయకున్నను | మాఁడుఁగాదె
పాడుకడుపని దానిని | బస్తుపెట్ట,
నెచేటి కొడలేగి పనిచేయ | నీయకుండ,
ముష్కరత రెండు కన్నులు | మూఁతపడియె. 3

గీ. తెక్కలాడిననే కదా ! | డొక్కయాడు,
నడఁగు నిఁక నయ్యు పొంగని | హస్తయుగము
పట్టుదలతోడ వస్తువుల్ | పట్టమానెఁ,
బట్టెఁ డన్నంబు నోటను | బెట్టమానె. 4

గీ. దిక్కుమాలిన పొట్టకై | దేహభార
మంతయును మోయుచుంటనే | సింతవఱకుఁ,
జాలు! నీవెట్టిచాకిరి, | చాలు! ననుచుఁ,
బదయుగ మొకింత కదలక | మెదలకుండె. 5

ఆ. మనముదిద్ది, తీర్చి | మార్గమిచ్చినఁగాదె,
దారియుండుఁ బొట్ట | గారి, కనుచు,

వక్త్రగహ్వరంబు § వాకిలిమూసెను,
బండ్లు నమలమనియెఁ § బట్టుబట్టి. 6

ఆ. అయ్యగారిప్రాణ § మంతయునాచేత
నున్న, దెవ్వరేమి § యొనరిచినను,
గ్రుక్క వేయకున్నఁ § గుదురు రోగంబని,
మెతుకు నొకటి గొంతు § మ్రింగకుండె. 7

సీ. ఇట్టులన్నియుఁ జేలపట్టి § పొట్టగిట్టఁ
జేయనెంచిన, వచ్చెను § సేగి తమకె,
యితరులకుఁ గీడుసేయ నూహించువార,
లోగుచెందుదురేకాని § బాగుపడరు. 8

సీ. కాళ్లుచేతులుఁ బూచిక § పుల్లలయ్యె,
గ్రుడ్లు రెండును దిగఁబడి § గుంటలయ్యె,
వాడి, దౌడలువట్టి య§ప్పడములయ్యె,
వక్త్రమును, గొంతు, జీవచ్ఛ§వంబులయ్యె. 9

సీ. క్రొత్తయాహార మేమి గై§కోనమి, మేన
నేమిరక్తప్రసారంబు § లేమి, యావ
దంగములు పొట్టతోఁగూడ § నడఁగిపోవ
సిద్ధమై యుండె శల్యావ§శిష్టముగను. 10

సీ. పొట్టయొక్కటియే యన్న§మును గ్రహింప,
తన్నసారంబు సర్వదే § హంబునకును,
బంచిపెట్టుచునే యున్న § దం చెఱింగె,
నంత జెరిగినపిదప, నా § యవయవములు. 11

సీ. ఉర్వి నన్యోన్యసంబంధ§ముండువారు,
కేవల స్వార్థపరులయి § కెరలి యీర్ష్య,

నొకని కపకారమును జేయ నుద్యమింప,
నందఱును హానిఁజెందుదు రతనితోడ. 12

ఆ. ఎవరిసుఖము వారె యెంచుచుఁ బనిచేయ
రాదు, గృహమునందు, రాజ్యమందు;
మనసుఖంబుతో సమష్టిసుఖంబును
గలుగునట్లు చేయ వలయుఁ బనులు. 13

---

## 5-గట్టుప్రభువు కుచేలోపాఖ్యానములోని పద్యములు.

శ్రీకృష్ణమూర్తియును, కుచేలుఁడును, చిన్నప్పుడు, సాందీపుఁడను గురువునొద్ద చదువుకొనిరి. అప్పుడు వారిరువురును ప్రాణస్నేహితులయి, కలసిమెలసి, ఆడుకొనుచుండిరి. చదువయిన తరువాత, ఎవరియింటికి వారుపోయి, చిరకాలము దూరముగా నుండిరి.

శ్రీకృష్ణుఁడు బలపరాక్రమములలో, ఐశ్వర్యమహిమలలో అసమానుఁడై రాజాధిరాజై, ద్వారకాపురములోనుండెను. కుచేలుఁడు యోగ్యుఁడును తపస్సంపన్నుఁడును అయినను, పరమదరిద్రుఁడై, బహుసంతానవంతుఁడై, ఉత్తమురాలగు భార్యతో, ఒకకుటీరములో,అన్నవస్త్రములకు మిక్కిలి చిక్కుపడుచు, కాలముగడపుకొనుచుండెను.

బాల్యస్నేహితుఁడగు శ్రీకృష్ణునొద్దకు వెళ్లి, యాచించి, దారిద్ర్యబాధతొలఁగింపుఁడని, ఒకనాఁడు భార్య, కుచేలుని నిర్బంధించెను.

కుచేలుఁడు కృష్ణునకు సమర్పించుటకు దోసెఁడు అటుకులు మూటగట్టుకొని, ద్వారకకునడచివెళ్లి తనవృత్తాంతమంతయు, చెప్పి; "శ్రీకృష్ణదర్శనము చేయింపుమ"ని ద్వారపాలకుని ప్రార్థించెను.

"అయ్యో! వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! వారిదర్శనముకాక మహారాజులెందఱో వాకిట పడిగాపులుపడియుందురు. అట్టిచో నీవంటిబీదబాఁపనయ్యకుఆమహానుభావునిదర్శనమెట్లగును"అని ద్వారపాలకుఁడు పలికెను.

"నాఅదృష్టమెట్లుండునో, నాయనా! లోపలికివెళ్లి ఆయన తో నాసంగతిమనవిచేయు"మని కుచేలుఁడు ద్వారపాలకుని బ్రతిమాలెను.

అతఁడట్లు చేసివచ్చి, "మీరెంతటిమహాత్ములో! ఎట్టిభక్తులో! మిమ్ము శీఘ్రముగా, సగౌరవముగా, తీసికొనిరమ్మని శ్రీకృష్ణప్రభువుగారు సెలవిచ్చినారు." అని కుచేలుని పాదముల కు నమస్కరించి, ఆయనను లోనికిఁ గొనిపోయెను.

అతనిని చూచుటతోడనే, శ్రీకృష్ణుఁడు లేచి ఎదురుగా వెళ్లి, కౌఁగిలించుకొని, పూజించి, షడ్రసోపేతమైన భోజనము పెట్టి, తనపాన్పుపై కూర్చుండఁబెట్టుకొని, ప్రేమలూరుచూపులఁ జూచి, ఇట్లు పలికెను.

క. ధరణీసురచంద్రమ! నీ
దరిసెనమున మేముపాదలెఁ గ దనిసెను జిత్తం
బిరవుగ, మన్మందిరములు
పరమపవిత్రంబులయ్యెఁ భాగ్యములబ్బెన్ ॥

ఆ. వె. తడవుదినములకును, § ధరణీసురశ్రేష్ఠ !
మాకుమీకుసంగ§మంబుగలిగె,
నడవియామలకము §నంబుధిలవణంబుఁ
గూడినట్టులయ్యె § నేఁడు చూడ.

ఆ. వె. పెండ్లియాడినావె ? § పెక్కండ్రుకొడుకులు
కలిగినారె ? నీకు§గ్రాసవాస
ములుకొఱంతపడక §కలుగుచున్నవె యెల్ల
కాలముననునొక్క § గతి, మహాత్మ ? ||

ఆ. వె. ప్రజలనెల్లనీతి§బాధలఁబడనీక
పాలనంబుచేసి§పరమమైన
ధర్మమార్గమునను § ధరణిరక్షింతురే
మీపురంబులేలు § మేటినృపులు ?||

ఆ. వె. వెనుకబాల్యమునను § మనముసాందీపుని
యొద్దఁజేదువునాఁటి § సుద్దులెల్లఁ
దలఁచుకొందునెపుడుఁ, § దలఁతువేయవినీవు
తెఱచునెమ్మనమునఁ § దాపసేంద్ర ? ||

క. గురుభార్యమున్ను మనలను
జిఱుతలనిద్దఱనువంట § చెఱకునకనుపన్
మురియుచుఁబరువులు వెట్టుచుఁ
దెరలిమహాటవులయందుఁ § దిరిగితిమిగదా !.

ఆ. వె. మఱలివచ్చునపుడు § మార్గంబెఱుంగక
యట్టిపోయియడవి § నట్టనడుమఁ
బ్రొద్దుమునిఁగివాన § పోరిఁబోరిఁగురియంగఁ
దడిసివడఁకితిమిగ § దా ! మహాత్మ !.

క. జడివానగురిసె, బిడ్డలు
తడసిరి, యెందేనిదారి ఽ తప్పిరొాయనుచుఁ
గడువడి వెదకుచు గురువరుఁ
డడవి మనలఁ జూచియలరు ఽ టదిమఱవవుగా !

---



## 6. రెయిలు బండి.

గీ. గుప్పుగుప్పునఁ బొాగయును ఽ నిప్పు రవలు
పైకిఁ జిమ్ముచుఁ, గూబలు ఽ పగులునట్లు
లఱచుచును, రొాద సేయుచుఁ ఽ నతిరయమున
నెన్ని యామడలైన నీ ఽ వేగఁగలవు! 1

వేళ, కన్నము దినకున్న ఽ సోలిపడుదు
రండఱను; నట్టిచిక్కు నీ ఽ కెందు లేదు,
బొగ్గులను మాత్రమపు డప్డు ఽ బొక్కి, నీరు
మంచిదో, యుప్పదో, త్రాగి ఽ మనుదు వీవు. **2**

గీ. ఇన్ని బండ్లనుగట్టినా ఽ రింతబరువు
వేసినారెట్లు నడతు న ఽ న్వాసుగు లేక,
పొమ్మనుటె తరువాయిగాఁ ఽ బోదు, మొదటఁ
గదలు చోకకొండచిలువ రా ఽ కాసి పగిది. **3**

గీ. ఎక్కువారును, దిగువారు, ఽ నెక్కుసరకు,
దిగెడు సరకను; నీకేది ఽ తీఱుపాటు ?
గాలి, వర్షంబు, నెండఁ, జీఁ ఽ కటిని, లక్ష్య
పెట్టకుండఁగఁ బోదు వే ఽ వేగ నీవు. **4**

గీ. మఱచి యాలస్యముగ వచ్చు ఽ మనుజకోఱకు
వేచియుండక, వడి నీవు ఽ వెళ్లుచుండ,
వృథగ పోవరి, తెల్లనో ఽ ర్వెట్టుకొనుచుఁ
జూచు నీవెంటఁ, దనునోరు ఽ లూచ్చి నవ్వ. **5**

ఆ. జాల మింత చేయఁ ఽ జేనదు కార్యములందుఁ.
బర సహాయులగుచు ఽ బ్రతుకవలయు,
ననుచు మాకుఁ గఱపు ఽ నట్టులు వర్తింతు,
ప్రతిదినమ్ము రెయిలుబండి ! నీవు. **6**

---

మూఁడవభాగము.

# వ్యాకరణము.

ఈక్రిందివ్యాకరణాంశములను (వాచకపుస్తకములలోవచ్చిన రూపములనుగనఁబఱచి, ప్రశ్నలువేసి) బాలురకుబోధింపవలెను.

అనావశ్యకముగాఁ బరిభాషాపదములును సూత్రములును జెప్పి, వానిఁ గంఠపాఠము చేయింపఁ గూడదు.

వెనుకటిక్లాసులలోఁ జెప్పినవిషయముల యవలోడన మావశ్యకము.

I. సర్వనామములు.—నేను, నీవు, వాఁడు, తాను, మనము, ఎవఁడు, ఎవతె, ఎది, ఏది, అది, ఇది, అందఱు, కొందఱు, ఎందఱు, అన్ని, కొన్ని, ఎన్ని, ఒకఁడు, ఒక్కఁడు, ఒకతె, ఒక్కతె, ఒకటి, ఒక్కటి,—వీనికున్న యితర విభక్తి వచనరూపములను గ్రంథములోవచ్చినంతవఱకు నేర్పవలెను.

వాటిని, వీటిని, వేటిని, అందఱికి, కొందఱికి—మొదలగునవి మంచి రూపములు కావనియు, వానిని. వీనిని, వేనిని, అందఱకు, కొందఱకు—ఇవి సరియైన రూపములనియుఁ జెప్పవలెను.

పూర్వపద్యకావ్యప్రయుక్తములగు—ఒకోఁడు, ఒకోరుఁడు, ఒక్కొతి, ఒక్కొటి—మొదలగు రూపముల జోబితాముట్టఁ గూడదు.

II. నామ విశేషణములు.—

వాఁడు మంచి మనుష్యుఁడు. అదిచక్కని పిట్ట, నీవు వేఁడి నీళ్లు పోసికొనుచున్నావు.

మనుష్యుఁడు, పిట్ట, నీళ్లు.—నామవాచకములు. మనుష్యుఁ డెట్టివాఁడో, పిట్టయెట్టిదో, నీళ్లెట్టివో చెప్పు. మంచి, చక్కని, వేఁడి వాని విశేషణములు, అనఁగా నామవిశేషణములు.

III. క్రియా విశేషణములు.—

గది విరివిగానున్నది. అతఁడు శ్రద్ధగాఁ జదువుచున్నాఁడు. చింతపండు పుల్లగా నుండును. ఈమాటలు, ఉన్నది, చదువు చున్నాఁడు. ఉండును అను క్రియలతో సంబంధించినవి. కనుకఁ గ్రియావిశేషణములు. వీనికి సాధారణముగా 'గా' వచ్చును.

IV. బహువచన విశేషణములు సాధారణముగా నేకవచనములోఁ గూడ నుండవచ్చును—మధురమైన పిండివంటలు, మధురములైన పిండివంటలు, పిండివంటలు మధురముగా నున్నవి, పిండివంటలు మధురములుగా నున్నవి.

V. వాఁడిక్కడకు వచ్చెను. 'వచ్చెను' సమాపకక్రియ సమాపక మనఁగా ముగించునది. ఈక్రియవాక్యమును బూర్తిచేసినది.

VI. అన్నము తిని—'తిని' యనునది యసమాపకక్రియ. వినునతఁ డింకను నేదో చెప్పునని చూచుచుండును. చెప్పవలసిన దంతయుఁ జెప్పలేదు. చెప్పకపోయిన 'అన్నము తిని' ఏమిచేసితివని యడుగవలసి వచ్చును. అప్పుడు "అన్నముతిని బడికి వెళ్లితి" ననియో "అన్నము తిని నిద్రపోయితి" ననియో, యింకొకరీతినో వాక్యము

పూర్తిచేయవలెను. వాక్యమును అసంపూర్ణముగా నుంచు క్రియలన్నియును అసమాపక క్రియలు.

1. వానగురియఁగా (వరిమళ్లు నిండినవి)
2. వాఁడు నవ్వుచు (నడచుచున్నాఁడు)
3. నీవు మాటాడక (యూరకుంటివి)
4. భోజనము చేసిన (నాఁకలిపోవును)

పై వాక్యములలో — కురియఁగా, నవ్వుచు, మాటాడక, చేసిన—ఇవి యసమాపక క్రియలు.

---

Printed by R VENKATESHWAR & Co., Madras—June 1929.